ఆ॥ వె॥ ఈనిజామురాజ్య మెట్లైన మనకేమి?
చేయవలసినంత చేసినారు;
వినరు వారు; మిమ్ము విడఁదీసె దైవ; మీ
ముండ్లపొదల లేదొ మొగలిపువ్వు?॥ 74

మ॥ మనకుఁ జిక్కులుగూర్చు నీయవనసంపర్కంబు నిర్మూలఁదీ
సినపున్నెంబున కుత్సహింపవలె; గాసింబొంద మీకేల? కం
సునకుం బాసిన వాసుదేవుఁడ వటంచున్ మిమ్ము భావింతు; నా
జనకుం డీసునఁ దప్పుదారిఁ జనె; నిచ్చల్ పాపముల్ పాపవే?॥ 75

ఆ॥ వె॥ ప్రకృతిసాధనములఁ బటుసత్త్వ మొసఁగుంచి,
తపముఁ జేసి, దేశదాస్యమోక్ష
సిద్ధిఁ గనుఁడు; మీకు సిద్ధింపదా, భగీ
రథుఁడు గంగఁ దేరఁ బ్రభవమందు"॥ 76

మ॥ అని యావీరవధూవతంస ముచిత వ్యాపార మేపారఁ బ
లికిన, షాజీ కనుదోయి విప్పులరఁ దెల్వొం బొంది, గుఱ్ఱాలి మే
లున కుప్పొంగెఁ; బ్రియాణ మింత చను నాలో వెంట దూరంబుగా
గనుపించెన్ జటులాపతత్తురగ రింఖాధూత ధూళిచ్ఛటల్॥ 77

చ॥ "వెనుకొనివచ్చె నీతురగవీరపతాకిని; యెవ్వరింతగా
ననుపునఁ బొంచి దూఁకి" రనియారయుచోఁ: నొకదూత వచ్చి, గొబ
య్యన $ "లుకజీవిభుండు ప్రళయాంతకుఁడై మిముఁదాఁకి యోగ్యఁగా
ఘనతర సైన్యముల్గొని, యెకాయకి వచ్చె" నటంచుఁ దెల్పెనా॥ 78

---

$ "Lukhaji pursued him until the barriers of Phaltan were reached."

Page 18. "The Life of Sivaji Maharaja", by
N. S. Takakhav, M. A.

చ॥ పడగను ద్రొక్కఁగా బడినపామువడిన్ జెలరేఁగి రోఁజుచున్
"దడఁబడనేల? వట్టియనుతాపము లేల? యతండొ నేనొ యీ
పుడమినిఁ బాయుదాఁకఁబగవో; దిది పారము ముట్టి చూతు; న
ల్లుఁడనియు మామగారనియు లోకము మ మ్మనకుంటఁ గావుతన్॥

మ॥ తననీడన్ జగమెల్ల నుండవలెనో? తాఁ బాడినన్ల్లెఁ గై
కొని తాళమ్మును దట్టఁగావలయునో? కొండంతవాఁ డెవ్వఁడున్
దనకన్నన్ గుడిచేయిరాట తగదో? తత్త్వమ్ముజోకొట్టి, దే
నినిఁగానీ తన కన్వయింపవలెనో? నే నింతసైరింతునే?॥ 80

చ॥ అడఁకువ - భీతిచేత, హితమాడుట - నీదయగోరి, గౌరవం
బిడుటయు - నీమహోపకృతి కేను విధేయుఁడనౌట, యిట్టియం
గడి నను నమ్మి, నాపనులఁగైకొని నీదగుముద్ర వైచి, వే
ర్వడి యసమర్థుఁజేసి, విడఁబట్టి ననున్ దఱుమాడుచుంటివే?॥ 81

తే॥ అయినదైనది, వట్టి వాక్యార్థమేల?
యొక్కమునుకతోఁ జలియెల్ల నుడుగఁజేతుఁ;
గొడుకును బడంతినిన్ గొంచుఁ గొంద జేగుఁ"
డనుచుఁ, దనసేవకుల కతం డానతిచ్చె॥ 82

క॥ మహాజీపలుకుల యురవడిఁ
దహాతహాపడి, జీజియా యుదారవిచార
స్పృహణీయ వచనరచనా
మహితంబుగ ననియె నాథుమది గుదిగొనుచున్॥ 83

చ॥ "త్వరపడనేల? కాలపరిపాకము సర్వము నిర్వహించు; ని
ట్లరిమినమాత్ర శూరుఁ డతఁ డయ్యెనె? మీ రటు కాకపోతిరే?
యెఱుఁగు జగ్గంబు; తాలిమివహింపుఁడు; భారతమున్ దలంపుఁ; దు
ర్ధురభుజశాలులై యదనుదొక్కుచు, మామకు బుద్ధిసెప్పుఁడీ!॥ 84

ఆ॥ వె॥ బలములేదు; తగినపరికరమ్ములు లేవు;
వట్టిబయలఁ దెగువ ముట్టనేల?
కదలిపోద మిపుడ; కాదేని జీజియా
బాయి తోఁటి సత్యభామ నిజము"॥ 85

చ॥ అని సమయోచితంపుహితమాడు కుటుంబినిమాట కొగ్గి, 'యీ
పని యుఱ' వంచునాడు పరివారముపలుకుల నాదరించి, పై
కెనయు రుషాదవాగ్నిని జయించి, షహాజి నిజానుయాయులన్
గొని పయనించె శత్రువులకున్ దఱిగాని మహాజవంబునన్॥ 86

చ॥ పరిణతగర్భమై యుడుకుఁబర్వుల కోర్వనిధర్మపత్ని - న
క్కఱినసుతున్ గనుంగొని, యకంపితమగు తనచిత్తవృత్తియున్
బఱియలుగాఁగ, మీఁదిపయనమ్ముల మానుచుఁ జెంతనున్న జు
న్నరుపురిఁ జేరి, యందుఁ జిననాఁటిసఖుం డగువానిఁ గన్గొనన్॥ 87

ఉ॥ ఆ గుణశాలి 'నింబళుక' రన్వయరత్నము శ్రీనివాసరా
వీగతి వచ్చియున్నహితు నెంతయుఁగూరిమి నాదరించి, వ
స్థాగమలక్ష్మికిన్ గుఱుతులై కనులూర, మనోమయూరలా
స్యాగము మొప్పఁ గౌఁగిలిడె; నాతనితోడ షహాజి యిట్లనన్॥ 88

మ॥ "లుకజీచేసిన దుర్ణయంబుమెయిఁ గాలు న్నిల్పఁగా నైనఁ దీ
ఱికలేదేగదనేను; నీ వతనిబారిన్ బాపి, దాదోజిచెం
తకుఁ జేర్పింపుమ యీమె; గర్భవతిగానన్ వెంటఁగొంపోవఁగాన్;
దిఁక నన్నున్ బలవంతపెట్టకుము; నా కీమేలు సేకూర్పుమీ!"॥ 89

తే॥ అనుచు షాజీ కులాంగన నచటవిడిచి,
తనయుఁ దోడ్కొని, భటులతోఁ దరలిచనియెఁ
దఱుముకొనుచు, లఖూజి తత్పురముసొచ్చి
శ్రీనివాసరావు గృహంబుచెంత నిలిచె॥ 90

ఉ॥ అల్లుఁడు లేఁడు; తోడిభటు లంతకు లే; రొక శ్రీనివాసరా
వల్లన వచ్చి యున్నకథయంతయుఁ దెల్పిన, నూర్పుపుచ్చి, ఘూ
ర్ణిల్లుమనంబుతో మిణుఁగుఱించిన కన్నులతోడ జీజయా
యుల్లము దూసిపోవఁ బరుషోక్తులఁ గ్రిక్కి, లఖూజి యిట్లనున్॥
ఉ॥ "తప్పికొనెంగదే పరువుదప్పినశూరుఁడు! మీస మున్నచో
నిప్పని సేయనేల, యెదురెక్కి నిలంబడి పోరరాదె? యీ
యప్ప యరిప్రకాండము లయంబొనరించి, స్వదేశలక్ష్మికిన్
గొప్పకిరీట ముంచునఁట, కోటలుదాఁటెడు మాట లేటికో!॥
సీ॥ నీమాటవినని నాతో మచ్చరించి, నీ
మతము సాధింపఁ గుచ్చితముఁబూని,
నీశ్రీనివాసుతో నీమేనమామతోఁ
గుటిలుఁడౌ మోహితేకులజుతోడఁ
గలయికల్నెఱపి, చొక్కపుఁజెల్మిఁ $ జుట్టఱి
కంబు నొండొరులతోఁ గట్టికొనుచు,
నను విడఁదీసి, యీసునఁ జిక్కుముడివెట్టి
యడఁగఁద్రొక్కఁగ నిట్లు వెడలినాఁడ;
తే॥ గీ॥ విది యెఱింగితి మొన్న; నీమెదడుఁదీసి
చక్కఁబఱుపఁగా నిటు కాలుద్రొక్కుకొనుచు
వచ్చితిని; నీబలంబెల్లఁ దెచ్చి నిలుము:
తేల్చెదను నేనొ వారలో దిక్కునీకు॥
ఉ॥ నాపెనుపొంది, నాదుకరుణంగొని యల్లుఁడవై ఘనుండవై
రేపునుమాపు నన్ననుసరింపుచు, నేఁటికిఁ గోఱవచ్చి, న
న్నాపుచు బుద్ధిసెప్పఁగలవా తులువా? నినుఁ జేరఁదీసినన్
బాపపుఁ బాపజాతులకుఁ బాలిడిపెంచిన ముప్పుదప్పునే?॥

$ "He (Lukhaji) feared that Shahji might be reinfor[ced] with the militia of the Nimbalkars." N. S. Takakh[av]

## లుకజీ జీజియాల సంభాషణము.

¶ నా యుపకారమెల్లఁ దినీ, నాకె దురంతము లెన్నుచున్, విష
ప్రియుఁడవైన నిన్ దఱిమిపట్టక, యాయువుముట్ట కుంపెరా:
దేమెడనైన దిక్కుగలదేఁ గొనిర" మ్మనునంత, జీజియా
డాయుచు, "నాగు-మాగు: వికటంబుగఁ దాండవమాడ నేటికిన్?" 95
॥ అని కాత్యాయనిపోలె దూఁకి, సముఖంబై, కంటఁ గెంపూర, ని
నినసింగంబటు రోఁజుచున్ బలికెఁ "గానీ! దిక్కులేదేమి నా
కును నాభర్తకు? నాయువుంగొనెదవా కో? రమ్ము నేనుంటి నా
తనియర్ధాంగము; నేమిచేసెదవొ, పంతంబెట్టిదో చూచెదన్!॥ 96
॥ అంతరువెంచి, నీదుమరియాదలనెంచి, హితంబునెంచి వ
ర్తింతువుగాక; నీపలుకుతీండ్రము నీమదివేండ్రి మొప్ప న
ర్గింతువొ, జీజియాను గుఱుతింపవొ, చంపెదొ, చంపనేర్తువో?
యెంతకసాయి! వీవు మనియే, నను దిక్కఱఁజేయుచుంటివే!॥ 97
॥ కెవ్వన హుంకరించి యడికించెద, వాయుధ మెత్తుచుంటి వీ
వెవ్వరిపైన? నీయెడఁద కింతవివేకము చాలదయ్యెనే?
గువ్వలుఁగూడఁ గాన్పులను గూరిమిఁబెంచుజగంబునందు నీ
వెవ్వఁడవయ్య? యాదరణకెక్కరె యల్లుఁడు నాఁడుబిడ్డయున్?॥ 98
॥ కనికర మింతలేనికొటికాఁడవు నన్నిటుపెంచనేల, పు
ట్టినయపుడే గళమ్మటమటించినఁ బోవదె? వెంటనంటి యు
య్యానువున వేఁటలాడ మనసయ్యెనె? కన్నసిసూనము గావ
ర్తనమది సర్పజాతికిఁగదా, యొకమానవుఁ డిట్లుసేయునే?॥ 99

¶ "Her father never excused the injury that had mortified his pride, and the turn of events, which made Shahaji king-maker at Ahmednagar and Daulatabad, only aggravated this enmity ... ... He retired to Bijapur hotly pursued by his father-in-law." M. G. Ranade.

మ॥ ఒక కీడే యొనరించినాఁ డనుము, నీ వుద్రేకముం గందువో?
ప్రకటంబౌ మనజాధవాన్వయపుమర్యాదల్ దిగంద్రోతువో?
'లుకజీ యల్లున కిట్లొనర్చె' ననుచుం లోకమ్ము పై కెత్తునిం
దకు నీయాదలవంతువో? ప్రణయబంధ మ్మిట్లు పోకార్తువో?॥

తే॥ వింతవేడుకఁ దొలికాన్పు సంతరించి
బుడుతమన్మనిఁ గౌఁగిటఁ బొదివికొన్న
సదయహస్తంబు లిపు డిట్లుపదిలపడెనె
పదనుకత్తులఁ గుత్తుకల్ చిదిమిపోయ?॥

తే॥ పసుపుఁగుంకుము, నుదుటిపై బాసికంబు
పెండ్లియుడుపులు, నునుసిగ్గుపెంపు దోఁప,
నడుగులంటిన మ మ్మొత్తి, యాదరించి
యిడిన దీవనపరమార్థ మిదియె, తండ్రి?॥

సీ॥ అనురాగనిలయ నాజననిమాల్యాదేవి
కడుపులోఁ గార్చిచ్చుఁ గనలఁ జేసి,
కన్నీటిబుగ్గ బుగ్గలజాఱఁ గుమిలిపో
యెడు నన్న 'యక్లోజి' యెడఁదఁ దున్ని,
తల్లిదెక్కలపోవుఁ దలఁగని సాంభాజి
భావిజీవితనౌక భంగపఱచి,
కమియమాఁగినపండు గర్భపిండ మగల్చి
కలుకుఁగాఁకలదాలిఁ గ్రాఁగఁ జేసి,

తే॥ ఇంతపరిశయంబుఁ గలిగింప నేలనయ్య?
కనికరము లేదొ, పాపసంకటము రాదొ
కన్నతండ్రివిగాదొ, యకటసముపోదొ
వలదుఃవలదయ్య పచ్చనియిలు రగుల్ప!॥

సీ॥ రంగపంచమిపండుగన్ 'గులాల్బుక్క' యా
డెదుమమ్ముఁ గని కూర్మిపడిననాఁడు
పదిమందిబందుగుల్ బలిసినచవికెలో
మెచ్చి కన్యాదాన మిచ్చునాఁడు
పెండ్లిలో మెఱవడివెంట బెత్తముఁగొంచు
జనుల బరాబరుల్ సలుపునాఁడు
పుడికి బుద్ధులుసెప్పి, యొడినించి, మగనితో
నత్తగారింటికి ననుపునాఁడు
తే॥ మొగమునందాడు నానందముద్రి నేఁడు
చెదరి భయదమై నిప్పులుచెరుగుచున్న
దయ్యొ! కనఁజాల నిను; నీ లయాంతమూర్తి
యుడిగి, శాంతించి, సుప్రసన్నుఁడవు గమ్మ!॥ 104
ఆ॥ వె॥ ఉబికి, రెండుకనుల నురియాడుచున్నది
కన్నప్రేమ - నన్నుఁ గన్నప్రేమ
నాకెకాదు, చూడు నీకును; దండ్రి! యీ
కనుల మూసికొనెదొ? కాచికొనెదొ?॥ 105
మ॥ పసుపుం గుంకుమ పూలు పూజలిడి, సౌభాగ్యంబు శోభిల్ల, భూ
మిసురవ్రాతము దీవనల్ గురియ, నా మేలెంచి కట్టించితిం
పెసఁగన్ మంగళసూత్ర మీమెడను; దండ్రీ! దీని నీచేతులా
ర," — సతీరత్నము వెక్కి-యేడ్చె నెదజాఱంగ రుద్ధకంఠంబునన్॥
వ॥ పలపలఁ గంటిజాలు రలిపాఱఁ, గరాళకరాసి జాఱఁ, దో
ట్రిలునడ మీఱ, జాధవుఁడు ఱివ్వనఁ బుత్రికదాపుఁ జేరి, చే
తులఁగొని, యక్కునన్ జొనిపి, తొంగలిరెప్పలపోన లొత్తి, కెం
పొలసినబుగ్గల న్నిమిరి, మోడినకుత్తుకతోడ నిట్లనెన్॥ 107

సీ॥ "కళవళపడి యెంతయలసితివే తల్లి!
దయలేని నావంటితండ్రివలనఁ,
దడిలేదు పెదవిపై, దడ తగ్గలే, దపా
యములేదుగాదె గర్భాశయమునఁ?
గనలుకుంపటి రాఁజుకొని కాలుపోగ సాఁమఁ
గనసైతి ని ట్లంటుకొనుట, తల్లి!
తలిమెంచి, యమృతమ్ముగురియించి, సాదనార్పి
నిలిపితివమ్మ! పెద్దలతపమ్ము;
తే॥ ఆఁడుబిడ్డవు, దొడ్డయిల్లాల, విపుడు
నిండుచూలాల, వీవు కన్నీరువిడువ
నాకులమునిల్చునే? తల్లి! నన్నుఁ జూచు
చూడు నీపుట్టినింటికి శోభనములు॥

చ॥ నసువిను; సింధుఖేదునకు నావెరుకన్ జనుదెమ్ము తల్లి! సే
పెనిమిటినిన్ గుమారుఁ బిలిపించెదఁ, గానుపు సంతరించెదన్,
దనయునిఁ గుస్తరించుకొనుదంపతులన్ మిముఁ దండ్రిమాపులన్
గని మది సంతసింతు; నుపకారమయా! యిది సమ్మతింపవే!"॥

చ॥ అని బ్రతిమాలుతండ్రి కిటులాడె "దయామయ! నీమనంబువ
చ్చిన, దిదిచాలుఁ; జాలనివిశేషము దైవము నిర్వహించు; నా
ధునిపను పిట్టులుండె; నిది తోఁయఁగరా; దభిమానశాలి నిన్
గన మొగమోడు; ఆయనకుఁగానిది నాకును నీకు సన్నమే?॥

ఉ॥ అక్షరమక్షరం బెఱుఁగవా తమయల్లునిచిత్తవృత్తి? పై
త్యకమగాదె నీ కెదిరియాడక యూరక జాతిపోక! శాం
తిషము వన్యబుద్ధి గమనింపకు; తెంపకు పేమవల్లి; ఫా
లాక్షునితోడుగా నతనియం దొకదోసము లే; దెఱుంగవే!॥

తే॥ తండ్రియెడఁదలోఁ దనయకుఁ దావుగల్గి,
యల్లునకు లేకపోవు టెంతైనఁ గలదె?
తలఁపకుము వేఱు; నీ ప్రేమనిలయమునకుఁ
దలుపుమూయకు; మిదియె ప్రార్థనము తండ్రి!"॥ 112

సీ॥ అనుమాటలకు బదులాడఁజాలక, లుక
జీ జాధవుఁడు సుతచేయి వట్టి,
"భయపడకమ్మ! నీపతియుండ నుండు; మీ
జరిగినదంతయు మఱచిపొమ్ము;
తలఁచినమాత్ర ఱెక్కలుగట్టుకొని వచ్చి
వ్రాలెద; దూరమణ వగవుఁ గొనకు;
కనుగల్గియుండు; మీకానుపుసేయ మీ
తల్లి మాల్యాబాయి తరలివచ్చు;"

ఆ॥ వె॥ ననుచు బుజ్జగించి, యభయహస్తం బిచ్చి
వలయుధనము దీవనల నొసంగి
శ్రీనివాసరావుచేతిప్రా పనురించి
జాధవుండు మరలిచనియెఁ బురికి॥ 113

తే॥ ఒక్కదత్తుఁడు, జయచంద్రుఁడొక్కఁ డూఁడి
రవని విపరీతదృష్టాంత; మఱి తెగాని,
కన్నబిడ్డకై ప్రాణముల్ కరఁగిపోయి
తండ్రియెడఁదకు సహజవత్సలత యరుదె!॥ 114

ఆ॥ వె॥ ప్రాణమెత్తుచూచి, పరిచర్య నడిపించి
జీజియా మనంబుచింత లుడిపి,
తడవు కొంత గడపి, దాదోజిఁ బిలిపింప
శ్రీనివాసరావు చెప్పిపంపె॥ 115

## దాదోజీఖాండదేవునితో జీజియాబాయి శివనేరుఁ జేరుట

సీ॥ కఱకుటెండలు గాసి, కాఱుమబ్బులు రేఁగి,
చిమ్మచీఁకటి శెరల్ గ్రిమ్ముకొనుచుఁ,
దళతళమెఱపుల్ బెళపెళయుఱుములై
కుండపోఁతలవాన గురిసి వెలియు
సుప్రభాతమునాఁటి సురుచిరప్రకృతితో
భల శాంతగంభీరభావుకముల
ననుభవింపుచు, జీజియాబాయి విస్మయ
వికచనేత్రముల భావింపుచుండ

తే॥ గీ॥ నంతలో నేగుదెంచె, బ్రహ్మస్వరూప
తా సుభగమూర్తియై వచ్చుతరణికరణి
ఘనుఁడు విశ్వాసి దాదోజిఖాండదేవుఁ
డనెడు సచివుఁడు బ్రాహ్మణుం డామెకడకు॥

క॥ వచ్చినయతనిఁ గని, సిరి
వచ్చినయటు చన్నయుసురు వచ్చినయటులన్
మెచ్చుచు, విచ్చినమొగమునఁ
దచ్చరణములందుఁ గంటితడితో వ్రాలెన్॥

తే॥ భర్త నెడఁబాసి, వాల్మీకిపదములంటి
పనవుచున్నసీతను దలంపునకుఁ దెచ్చు
జీజియాబాయినెత్తి, దాదోజి చలువ
పొలపమున నూఱడించుచుఁ బలికెనిట్లు॥

చ॥ "అడలకుమమ్మ! నీచరితమంత యెఱింగితి; నీ విటుల్ భయం
పడఁ బనియేమి? నాయుసురు పందెముగా నినుఁ గాచికొందు; నె
ప్పుడు తగవేది, యట్టియనుపుల్ బచరించెదఁ; గార్యమేమియి
య్యెడ? శివనేరుదుర్గమున కిప్పుడ పోవుద" మంచు, నాతఁడున్।

తే॥ పూలపఱపులఁ బల్లకిఁ బొందుపఱచి,
జీజియాబాయి నందు వేంచేయఁజేసి,
తగిన పరివారముల్ గొని తరలి చనిరొఁ,
ద్రోవఁగాచుచు 'శివనేరు' దుర్గమునకు॥ 120

తే॥ ఉచిత పరికర భరితమౌ నొక్క మేడ
విడిసి, తండ్రియై దాదోజి వేయికనుల
నరయుచుండఁగఁ, బతిరాక లరయు చామె
కణ్వుచెంత శకుంతలకరణి నుండె॥ 121

## షాజీ తనకర్తవ్యము నిశ్చయించుకొనుట

॥ జున్నరువీడి, దాపయినచోట నొకించుక వేచి, మామయుఁ
జన్న తెఱంగు నాత్మసతి సౌఖ్యముగా 'శివనేరు' దుర్గమం
దున్న తెఱం గెఱింగి, మదియూఱటఁబొంది, షహాజి మీఁదఁబో
నెన్నుచుఁ, బైపయిఁ మొలకలెత్తుతలంపులఁ దోఁగె నీగతిన్॥ 122

తే॥ గీ॥ "నెలలునిండినసతిఁ బాయు నెఱిఁ దపింతు
నా? నిలువులేని రాజ్యతంత్రముఁ దలంతు
నా? పగలుగొన్న చుట్టాల ననుసరింతు
నా? యొకనిఁబట్టి దైవ మిట్లాడనేల?॥ 123

॥ ఇది యొకదుర్ఘటంబగుపరీక్ష; తితిక్షకుఁ దావులేదు; 'మే
లిది' 'యిదికీ' డటంచు మనసిచ్చి, సహాయముఁజూపి, వెంటదూఁ
కెదననుమామ యిట్లు లడికించె; నిజామునవాబు కొన్నమే
లదిమి కృతఘ్నుఁడయ్యె; నిఁక నాత్మసహాయము నిల్పియుండెదన్॥

॥ అనుకొనియుంటి, నాబలముసంతయు నూఁది స్వతంత్రరాజ్యల
క్ష్మిని నెలకొల్ప; మామ యది ఛిన్నముభిన్నముసేసె; మామయే
యని యననేల, దైవమున కయ్యది యిష్టముకాదు; కానిచో
ననుపులుదప్పునే? యిటుల నందిసకొమ్మలు చీలిపోవునే?॥ 125

ఉ॥ ఒక్కొక్కఁ డుద్భవించు, బలుపొందిన యాత్మబలంబు నూఁదిలా
వెక్కుచుఁ, ద న్నెదుర్చునవియెల్లను ద్రొక్కుచుఁ, ద న్నడంచి
నిక్కుచు, నిప్పు - నీరమున, నిప్పుల - నీరము నేర్చికూర్చి పై
కెక్కెడు ధీరసత్త్వుఁ; డిది యెల్లరకుం దరియౌకొలందియే?॥

ఉ॥ నా కొనగూడియున్న కరణంబులు లావఱియుండె; నెందునుం
బ్రాఁకి పరాక్రమించె యవనప్రభుతాపటుతాండవంబు; నా
యేక ధనుర్ధరత్వము జయింపఁగనోపునె దీని? నిప్పు డా
కోకిలవృత్తి యుత్తమ మగుంగద ఱెక్కలువచ్చునంతకుం॥

ఆ॥ వె॥ కడఁక సమయమోర్చు ఘనుఁ బంద యన్నచో
మోటు తెగువవాని మూర్ఖుఁ డనరె?
అడఁగుఁగాక, పేడియగుఁగాక, పెనువీఁక
నాలఁ ద్రిప్పువాఁడె యర్జునుండు॥

ఉ॥ మొగలుపాదుషాహి తనుమ్రొక్కినవారలఁ ద్రొక్కి నైచు; నా
యాగమనంబుఁ గైకొన దహమ్మదురాజ్యము; గోలకొండలో
నా గుఱుతున్నవారలు గనంబడ, రొంటరిపాటు మేలె? నా
జాగిరుఁ జేరు నేర్పున బిజాపురముం గదలించిచూచెదం॥

చ॥ అగును మురారిపంతు సచివాగ్రణి యచ్చట, మేటిమాటఁ దీ
ర్పఁగలుగు నేర్పువాఁడు, కులబంధువు ప్రాణహితుం డతండు
కగు నుపకారమారసి సహాయము సేయకపోఁడు; వ్రేలుమో
పఁగ నెడమున్నఁ గాలిడఁగవచ్చుఁ, బరుండఁగవచ్చు నాపయిం॥

తే॥ గీ॥ జీజియాబాయి నోమ దాదోజి గలఁడు,
భయములే" దని తలపోసి, భటులఁగొనుచుఁ
దరలి, 'భీమా' తరంగిణి తటమువెంట
నడచి, 'సూపా' భిధానమండలముఁ జేరె॥

క॥ ఆ మండలమున 'సూపా'
నామకపత్తనము: దాన నవ్యవిభవశో
భామంజులమైతగు నిజ
ధామంబున విడిసి, కార్యతత్పరుఁ డయ్యెన్॥ 132

॥ తనభటులందు నొక్క-యుచితజ్ఞుని ధీరునిఁ బల్కు-పొందువిం
దెనసినవానిఁ జీరి, తగవెల్ల వచించి, 'హితమ్ముఁగొంచు ర'
మ్మనుచు బిజాపురమ్మునకు నంపి, నిజోద్యమసిద్ధిఁ గోరుచున్
మునుకొని దుర్గముల్ బలఁగముల్ గమనింపుచునుండె నచ్చటన్॥

తే। ఇంతలోన బిజాపుర మేగినట్టి
భటుఁడు చనుదెంచి యచ్చటివార్తఁ దెలిపె
దాన లాభములేమి వ్యక్తముగఁ దెలిసి
యరయుచుండె స్వతంత్రరాజ్యంబు తెరువు॥ 134

### శివాజీ జన్మవృత్తాంతము దాదోజీ షాజీకిఁ దెలుపుట.

॥ అలసాయాత సమీర సాయమిత సంధ్యా గర్భనిర్భిన్నకం
దళ బాలారుణ పాదచోదన దళన్మందేహ సందోహమై
చెలువౌ నొండొకసుప్రభాతమున షాజీ కాల్యకృత్యంబులన్
గలయన్ దీరిచియుండ, వచ్చె నటకున్ దాదోజి మోదంబునన్॥ 135

॥ విచ్చినమోముతో, విరియవిచ్చినకన్నులతోడఁ జేరఁగా
వచ్చి 'సుపుత్రలాభమున వర్ధిలు' మంచు శుభాశిషమ్ము నా
క్రుచ్చినఁ, బొంగి మేనఁగలక్రొన్నగలెల్లను నిల్వుదోఁపుగా
నిచ్చె షహాజి యాతనికి, నెల్లరకున్ దగఁ బంచెఁ గానుకల్॥ 136

క॥ "జీజా సుఖమున్నదె దా
దోజీ! సుతుఁడెట్టులుండెఁ? దోసమ్ములు లే
వే? జాతకమెట్టిది?" యని
షాజీ ప్రశ్నింప, నతఁ డెసఁగ నిట్లనియెన్॥ 137

ఉ॥ "ఏయెడరుర్ దపోబలము నెట్లలమున్? సుఖముండె జీజియా బాయి; కుమారుఁ డున్నత శుభంకరలక్షణ లక్షితుండు; రాజా! యవిజయ్యతేజమున కాస్పద మామఖమండలంబు నిధ్యేయము; యిట్టిమూర్తి గలదే జగమందని నాకుఁ దోఁచెనన్।

ఉ॥ మూఁడవకన్ను నెన్నుదుట, ముమ్మొనవాలు కరమ్మునందు, శేషేఁడు శిరమ్మునందుఁ జిగిరింపక, నాఁ డసనూయయింటఁ బారాడినపాపఁడే మనగృహమ్మున నేఁ డుదయించెనేమొ! తేకాడినవానిచాయ లవి యట్టివి; ధన్యుఁడ వీవు భూవరా!॥

తే॥ ౧ పదియునేనూర్ల నాలుగుపదుల తొమ్మి
దైన శాలివాహనశక హాయనములఁ
బ్రభవ వైశాఖ సితపక్ష పంచమీ కు
జాంక వాసరమున సుతోదయము రాజ!॥

క॥ శివ మార్ద్రానక్షత్రము
శివదైవత, మమృతకరుఁడు చెందిన శేశన్
గవి దైవత వృషరాశిన్
భువనోద్ధారకుఁడు సుతుఁడు పుట్టె నరేంద్రా!॥

---

౧ "క్రీ॥ శ॥ ౧౬౨౭ సం॥ ఏప్రెల్ నెల ౨౫ తే॥ కలిగతము ౪౭౨౮, శాలి ౧౫ విక్రమ ౧౬౮౪ ప్రభవ సం॥ వైశాఖ శు॥ ౫ మంగళవారము ౧౬-౪౭, ఆర్ద్రా ౫ అతిగండ 3-3౭, బాల ౧౯-౪౭, ౬-వి ౧౬-3 త్యాజ్య ౩-౫౦, అహస్సు 3౦ భుక్తి ౧-౪౦, ఈరోజున ఉదయాది ౫-3 ఘడియలకు వృషభలగ్నమందు జనన

—: శ్రీ శివాజీ జాతక చక్రము. :—

| | | | |
|---|---|---|---|
| | ర బు | ల | చం |
| కు శు | రాశి చక్రము | | రా |
| కే | | | |
| | గు | | శ |

| | | | |
|---|---|---|---|
| | శ | ల | [illegible] |
| రా | అంశాచక్రము | | [illegible] |
| | | | [illegible] |
| కు | బు గు | | |

"శ్రీశివాజి జాతకగ్రంధము." తెల్కపల్లి వెంకటసుబ్రహ్మణ్యసిద్ధాం

తే॥ ఆర్యమతములఁ బరులు ఊపాడునాఁడు
శంకరాచార్యుఁగన్న వైశాఖపంచ
మీదినంబిది నేఁడు జన్మింపఁజేసె
నపరశివు; నెట్టిమేలు ముం దరయఁగలదొ!"॥ 142

తే॥ అని పలుకు ఖాండదేవువాక్యముల కలరి
'సర్వమును శ్రీభవానీప్రసాద' మనుచు
సంతసముఁ దెల్పి, మనసులో సరదుఁగొన్న
చిటితలంపుల షాజీ వచించె నిట్టుల। 143

మ॥ *"మును మాతండ్రికిఁ దేఁ భవానియె వరంబుల్ గొన్న 'నీవంశమం
దనఘుం డొక్కఁడుపుట్టు, నాతఁడు స్వరాజ్యంబుఁ బ్రతిష్ఠించి ని
ల్పును ధర్మస్థితి, యిర్వదేడు తరముల్ పాల్పారుఁ దద్రాజ్య' మం
చని; యీనాఁడవి నిక్కమైనటుతలంపై కోర్కు లూరించెడిన్॥ 144

ఉ॥ $ మున్నొకనాఁడు నిద్రఁగనుమూసిన నా [illegible]యోగి తోఁచి, [illegible]
చిన్నలె పల్కి, పండొకటి చేతనిడెన్, జన; మేలుగాంచి [illegible]
విన్నది జీజియాంకు వినిపించి భుజించితి మాఁఫలంబు; నాఁ
డిన్నియు స్వప్నగాథ, లవియే నిజమయ్యెఁ గ్రమక్రమంబుగన్॥ 145

* Goddess Bhavani declared to Mallojee; namely, that "There shall be one of thy family who shall become a king: he shall be endowed with the qualities and attributes of Sambh; he shall re-establish and preserve justice in Maharashtra;... ... his reign shall form an epoch and his posterity shall mount the throne for twenty-seven generations.
Page 71. A History of the Mahrattas, by James Grant Duff.

$ One night he (Shahji) dreamt that a Hindu anchorite put a mango in his hand and said: "Share the fruit with your wife and you will be the father of a son, who will be the incarnation of the God Shiva." When Shahji awoke

సీ॥ అహమదునగరంబునం దున్నయపుడె మా
యిరువురిలోఁ దోఁచె నివియ రెండు
జాధవుండిచ్చిన చనవు వాని భరించి
పాదుల నెదిగించి ప్రోదిసేసెఁ
బ్రతికూల కాల తీవ్రత రేఁగి, యింతలో
వానిసుస్థితికి నెవ్వగలు గూర్చె
నిజసత్త్వమెనసి పూనికమెట్టి తటిఁబట్టి
యనుకూలగతి నిప్పు డవతరించె

తే॥ ¶ నవియసుమ్ము స్వతంత్రరాజ్య ప్రతిష్ఠ
యొకటి, జీజియాగన్న యభ్యుదయ మొకటి
నేను దానిని, నీవుదీనిని భరించి
పెంచుదము, దానినిది ముందు పెంచుఁగాక॥

తే॥ గీ॥ శ్రీ శివాదేవికరుణ నార్జించుకతన
నిపుడు శివనేరుదుర్గమం దెనయుకతన
ముందు హైందవధర శివం బందుకతన
నితనికి 'శివాజి' యనునామ మే నొసగు॥

చ॥ ఇఁకఁ బయనింపుమీవు; బరువెల్లను నీపయి నిల్చియుండెఁ; బు
త్రికుఁ గనిపెట్టి, జాగిరులరాబడిఁ బెంచుచు, రాజ్యభారముం
సుకముగఁ దీర్పు; మీ వనుపుసొమ్మున సాగుచునుండు నాదుపూ
నిక; తగుసూత్రధారుఁడవు నీవ గదయ్య స్వరాజ్యనాటకం!॥

---

from his dream, he found a mango in his hand, visited his wife and shared it with her. The offspring of this reunion was the birth of a little boy.

Page 181 "Great Men of India" by Rush Brook Williams.

¶ "... ... and he (Shahji) was himself secretly preparing for the inauguration of an independent sovereignty." N. S.

తే॥ జరుగుసంగతులెల్ల నీ వరయుచుండి
వలయుచో సాయ మేదైనఁ బంపుచుండు,
మరుగుమిా" యంచు దాదోజిఁ బంపి, తాను
సమయసముచితసన్నాహ సహితుఁ డయ్యె॥ 149

సీ॥ 'అలజహాంగీరు మొగలుపాదుషా పోయె'
నను వార్త నింతలో నతఁడు వినుచు,
'దైవము నాప్రయత్నము మెచ్చె, నిఁకఁ గొంత
యడఁగు మొగలు దండయాత్ర', లిప్పు
డహమదునగరరాజ్యము నన్నుఁ దాఁకలే,
దనుకూలమిది' యని యప్పుడె కదలి,
'భోసలే' కుల మూలపురుష వాసస్థాన
మగు 'వెరోళా' ప్రాంత మాక్రమించి,
తే॥ బలిసి, 'జున్నరు' 'దౌలతాబా' 'దహమదు
నగరు' 'సంగమనేరుల' నడుమఁ గల్గు
దేశమును గెల్చి, నైసుల తేజ మడఁచి,
యచట ₱ షాజీ స్వతంత్రరాజ్యమును నిలిపె॥ 150

చ॥ పృథులతరంబు 'భీమగడ' పెద్దలుగట్టినకోట నేఁటికిన్
శిథిలతఁ బొందియుండ, షహాజీ యది చక్క నొనర్చి, దాని దు
ర్మథనబలంబు లందుఁ దనరన్ 'షహాజిగడ' మన్నపేరునన్
ప్రథితముగా నొనర్చి, యది ప్రాపుగ నేలుచునుండెఁ బ్రాంతముల్॥

₱ "He brought within his grasp all the Balaghat (upland) country from Junair and Sangamner to Ahmadnagar and Daulatabad and attained to great power."

Page 249. 'The Modern Review' September, 1917.
'The Rise of Shahji Bhonsla' by
Prof. Jadunath Sarkar, M. A., F. R. S.

ఉ॥ కాలము కొంతవోయె; నట 'ఖాండిషు' నేలెడు 'కాంజహానులో
డీ' లయకాలుఁడై ప్రతిఘటింపఁగ, వాని నడంపవచ్చె నా
భీలత షాజహా; నతఁడు పెంపుమెయిన్ దనపైకి వచ్చుచో
నాలము పోలదంచని షహాజియు సంధియొనర్చె వానితో॥ 15

తే॥ కన్నుడిచి పాదుషా నిట్లు కలియఁబలికి,
కన్ను బెదరించి నైజాముకాలుగట్టి,
కన్నుగలిగి స్వరాజ్యంబుఁ గాచికొనుచుఁ
గుఱుచవాయ నైజాము లోఁగొనియె నతఁడు॥ 15

ఆ॥ దండుగట్టుకొని, 'పరెండా' పురమ్మును
గెలిచి రాజధానిసలిపి, యందు
విడిదిసేసి రాజ్యవిభవ మేలుచునుండ;
నపుడె యొకవిపర్యయంబు జరిగె॥ 15

## లుకజీహత్య, షాజీ జీజియాల పరితాపము

సీ॥ తమువీడి స్వార్థలాభముఁగోరి, మొగలు
పాదుషాపాదంబు పట్టె ననుచుఁ,
దమమర్మములు సెప్పి తంత్రముల్ నడిపి, మొ
గలులదాపునఁ దమ్ము నలిపె ననుచుఁ,
దమకుఁ బ్రాపైనయుత్తము షాహజీఁ దోలి,
తమకు దౌర్బల్యంబుఁ దార్చె ననుచుఁ,
దమరాజ్య మతఁడు కొంతకుఁగొంత గైకొను
చుండ, నూరక చూచుచుండె ననుచు,

తే॥ ఇంత లుకజీకుతంత్రమం చెంచి పొంచి,
నమ్మకముఁజూపి, రాజకార్యమ్ము పేరఁ
బిలువనంపి, నిజాంనవాబులు వధించి
రతని సకుటుంబముగ సభాభ్యంతరమున॥ 15

॥ ఒకనాఁ డాషహాజీహితుండగు నిజాముద్యోగి యేతెంచి, చీ
లికలైయున్న నిజామువిప్లవము లోలిఁ దెల్పి, 'మోసంపు ట
ల్లిక సుల్తానులు గొల్వుకుంబిలిచి బల్మిఁ బుత్రునిఁ బౌత్రునిఁ
లుకజీజాధవుఁ గొంతుకోసి' రనుపలుకుల్ వలుకఁగా నుగ్రుఁడై॥ 156

॥ "ఏమేమీ? లుకజీవిభుఁ దునిమినారే? కొల్వుకూటమ్మలో
నే? మోసంబొనరించియే? తెగువయేమీ త్రుళ్లిపాటెంత? సుం
తే మామాటఁ దలంపరే? తలఁచినారే దిక్కులేదంచు? నై
జామెల్లఁ దిటమానటంచు నడియాసఁ జేసి చెల్లాడిరే?॥ 157

॥ వాలుఁ డాలునుబూని బట్టబయలఁ బారాడి పోరాడుచుఁ
లీలాకేళి నరాతిమస్తముల బల్మిఁ దున్మితూఁగాడి, మీ
సాలఁ ద్రిప్పిన నొప్పుఁగాక; యిటు మూసఁ గ్రమ్గుచుఁ, వంటయి
ల్లాలై కూరలుగాయలుఁ దఱుగుతీర్పా నేర్పు వీరాళికిఁ?॥ 158

॥ మోగల్ సైన్యములుఁ బిజాపురబలంబుల్ చుట్టి ధట్టించునాఁ
డీ గాంభ్రీంపులు లేవు; నేఁడు పులులై రే, యిట్లు వేటాడిరే!
మోగల్ పాదుషహాను జేరుటయె తప్పో? తప్పు దండించుటో
యీగోపాతెరగ్రుద్దులాటలివి? ఛీ! ఛీ! యింత కార్పణ్యమే?॥ 159

చేసిరి చేతనైనపని చీఁకటికొట్టుస; దీన శాత్రవు
ల్మానిరటంచు నూఱటఁ జెలంగిరొకో సులతానుగారు? వి
శ్వాసనిహంతలఁ బులిమి పామెడు దాఁక మరాటుఁ డెవ్వఁడే
నీసుదొఱంగఁడం చెఱుఁగఁడే? యిఁకనైన నెఱుంగకుందురే?॥ 160

ఒకచో మామకుమాకునుఁ గలుగుఁగా కొక్కింత భేదమ్ము, కం
టికినిఁ జెప్పకు దూరమా నె? మదిఁ గౌటిల్యంబుఁ బాటించుచుఁ
లుకజీజాధవు నట్లుసేసినపు, డల్లుండైనవాఁ డెంతతే
లికమైపోమెఁ! గులావమాన మొకతాల్మిఁ బ్రింగువారుందురే?"॥

తే॥ అనుచు, నవమానఘాతరోషాగ్ని యొకటఁ
గుములుచుండ, వేఱొకట దిక్కుదరిలేక
కఠినహత్యా విదీర్ణాంగకములఁ బొరలు
చున్నచుట్టాలు మదికిరా నూర్పువుచ్చి॥

మ॥ "కసరుంబిండెల దూసిపోసి చిదుమంగాఁ జేతులెట్లాడెనో!
నిసుఁగుల్ దిక్కటి యెంతగాఁబదరి 'తండ్రీ' యంచు వాపోయిరో
యసిధారల్ జళిపించి పైఁబడెడు హత్యాభృత్యులం గాంచుఁ, దా
నసహాయుండయి మామ యెట్టి మరణాయాసంబునం గ్రాఁగెనో!

ఆ॥ వె॥ 'అందఱుండి తండ్రి యాఱడిఁబోయెనే!
యాపువీరుఁ డొక్కఁడైన లేఁడె!'
యనుచుఁ బనవు జీజియాబాయిమొగ మెట్లు
చూడనేర్తు! మొగము చూపనేర్తు!"॥

చ॥ అని బలితంపుఁజింత నురియాడుచు నూరుపువుచ్చి, జీజియా
కనువుగ వార్తనంపి, యెటులైనఁ బగం దెగఁదీయఁ గొంతయో
చనగొని, జీజియామది విషాదదవాసల మార్చు టిప్పు డొ
ప్పని కడుతొందరంగొని, షహాజి చనెన్ శివనేరుకోటకున్॥

చ॥ పరుగులువారుడెందమునఁ బర్విడి, రాజగృహంబుడాసి, హా
పురుమనియున్నవాఁకిటికిఁ బోఁ దడుమాడుచు మున్సాగి, ని
వ్వెఱగొనియున్న సేవకుల వెల్వెలఁబోయిన ఖాండదేవునిన్
నెఱిదుదరపిల్లుభార్యఁ గని, నిల్వున నీరయి నిల్చె దాపునన్॥

చ॥ నిలిచిననాథు గాంచి, మదినిండినశోకము పొంగి కన్ను ని
ప్పులఁగురియన్, జిజాంబ "యెడఁబాసెఁగదే గురుదైవతంబు! ని
మ్మలు మముఁ గాచుకోట పడిపోయెఁగదే! యిఁకఁ బుట్టినింటియ
సలు చెడిపోయెనే! పరువుచాలనిబిడ్డలఁ జేసిపోయెనే!॥

॥ అకటా! అంతటివాని కిట్టిమరణంబా! గొట్రైలఁబట్టి గొం
తుకలఁగోయు కసాయులట్లు కొలువందుఁ దండ్రికిఁబిడ్డ బి
డ్డకునుఁ దండ్రియు దిక్కులేనిగతిఁ గట్టా చుట్టిమట్టాడిరే!
యొకఁడే నించుక జాలిగుండెగలుగండో! కాంచఁడో బిడ్డలఁ॥ 168

సీ॥ మొనమొన్న నేగదా జననిఁ బంపుదుసంచుఁ
బోతివే యెటు మాయమైతితండ్రి!
పసుపుకుంకుముతోడ నెసఁగుమహాలక్ష్మి
తల్లి కీకడవ్రాఁత తప్పదయ్యె!
'నే నుంటిఁగాదె యక్కా! నీకు భయమేమి'
యంటివే యన్న! యెందుంటివయ్య!
పూలుగందమువెట్టి పూజించునిలువేల్పు
లొకరైన వచ్చి యాదుకొనరైరె!
తే॥ తొలఁగితివె నన్ను! నీప్రేమనిలయమునకుఁ
దలుపుమూసితివే, తండ్రి! తరలిపోతె!
కన్నసంతాన మిటు బైలుగాలిఁదోలి
కన్నుఁగవ మూసికొంటివే! కన్నతండ్రి!॥ 169

రోసముదూసి, నాఁ డొడలెఱుంగక యేమిశపించి, యీవిప
ర్యాసముఁ దెచ్చికొంటినొ గదా జనకా! 'చిటిమన్నఁ జింద' ను
చాసలుమీఱ నీదునొడియం దిడ నోఁచఁగనైతి; వ్యాసయా
యాసమగాక నేను సుతనై సుక మేమిఘటింపఁ గల్గితిఁ?॥ 170

తే॥ గీ॥ రక్తమునుబోసి నైజాముద్రాజ్యమెల్లఁ
బెంచితివి; వారు ని న్నిట్లు ద్రుంచినారె?
నీదుబలమును దేజంబు నేఁటి కగ్గి
పలుకు లయ్యెనె వారికన్నులకుఁ దండ్రి!॥ 171

తే॥ గీ॥ వేచి హైందవసంపదల్ దోఁచికొనఁగ
యవను లనుపుమై ఈదీప మార్చినారె!"
అనుచు, నాథునిమోముపై పెనసిచూచి
మెలుఁగు సవరించుకొని, యామె పలికెనిట్లు॥

ఉ॥ "కన్నులుచెమ్మగిల్లఁ దటకాపడి నిల్వఁగనేల నాథ! మీ
పున్నెము నాదుపున్నె మిటుపూచిఫలించె, గతించె సర్వ; మీ
కన్నులయాట మామ కొడికంపుఁదిలోదక మిత్తువో? తెగం
గొన్న కసాయిదాయగమికుత్తుక నెత్తురుదోయి లిత్తువో?॥

చ॥ ఒకయభిమానవంతునకు నోర్చుకొనందగుపాటియే కిరా
తకజన దుర్వ్యవహారమిది? దర్పసమగ్ర భుజార్గళచ్ఛిదా
వికలితరాజలోకుఁడగు వీరున కేమివచింపఁ? దండ్రిమే
రకుఁ దగు మామ; యా పరశురాముకృతజ్ఞత నిర్వహింపవే!॥

ఆ॥ గీ॥ పుట్టినిల్లు తఱిగిపోయు నశ్వత్థామఁ
దలఁచుకొన్న ద్రుపదతనయ నైతి;
బావసాయ మందుపార్థుండవౌచు, నా
కంటినీటఁ బగఱఁ గాల్పవలదె!॥

చ॥ కరకరగోయుచున్న మదికాఁకలకుః నిలుపోపలేక, యా
తరువును దాఁటి, కొంతబెడిదమ్ముగ నాడితినేమొ! వేఱుగా
నరయక యీసముద్యమమహాభరముః దరిఁజేర్పు; మామ కే
తెరు వుచితంబొ దానిని విధింపుము; నీమతమే మదు ద్రోహిదా॥

ఆ॥ వె॥ నాయభీష్ట మిదియ, నన్ను మన్నింపుము,
దుడుకుఁగొనకు, మలఁతఁబడకు, మోసగు
మఱచిపోకు; నాదుమంగళసూత్రమ్ముఁ
గాచికొనుచు, సవ్యసాచి వగుము॥

। ఇది యొకసాధనంబ యగునేమొ తలంచిన నూత్నరాజ్య సం
పదకుఁ; గృతజ్ఞతన్ నెఱపుపట్టుదలన్ బదనెక్కి, దుష్టులన్
మదమడఁగించి, ధర్మగమనంబును బెంచి, స్వరాజ్యసిద్ధి కా
స్పద మగుఁగాక నీదుకరవాల కరాళ విహారవైఖరుల్"॥ 178

। అని తగవార మేటితెగువార మనంబునదూయు జీజియాఁ
గని షహాజీ వచించెఁ, "గలఁగన్ బనిలేదు, నిజమ్ము వల్కు: తే
యనుచిత మేలగల్గు? దిటవారిన దిప్పుడు నామనంబు, మా
నిని! యిదె వాలుగైకొనెద నీహృదయమ్మున సానఁబెట్టుచున్॥ 179

। కనె నిన్నున్, గొనె నన్నుఁ; బెంచె ననురాగంబంది యిందాఁక; నా
య్యనఘున్ ముట్టుమదాంధులన్ జెఱుప కేసల్లుండనే? బీసగాఁ
జనుఁగా కొక్కఁడుదిక్కు లేనిగతి నైజామెల్ల; ఆనాఁడె వా
డని నీమోమును గందు, నీమనసు ముట్టంగందు, దీక్షావతీ!॥ 180

తే॥ గీ॥ కొలుతుఁ జాణక్య చంద్రగుప్తుల తపంబు;
నిలుతు నీమాట, నామాట నిలిపికొందు;
భయపడకు నన్నుఁగూర్చి; యాపదలు నీకుఁ
బాఁడమునో! వీరపత్నివి; పోయివత్తు"॥ 181

॥ అని జీజానెలవంద, నామె మొగమింతై చొంగటన్నిల్చి, నాఁ
చిన పేర్మికైకఫలంబుగా సుతు శివాజీఁ జేతికందిచ్చె; ఆ
తనయున్ గౌఁగిటఁ జేర్చి, ముద్దుఁగొని, చేతన్ ముంగురుల్ దువ్వి, వి
చ్చినమోమున్ దనుపారఁగాఁ గనియె షాజీ తృప్తనేత్రంబులన్॥

తే॥ గీ॥ చూపు మరలించి, భార్యకు సుతునొసంగి,
'ప్రాణపదముగా నితనిఁ గాపాడు' మనుచు
నచ్చుగాఁ జెప్పి, దాదోజి హెచ్చరించి,
గుండెదిటవున షాజీవిభుండు చనియె॥ 183

ఉ॥ పోయెడునాథుఁ జూపులెడవోయెడునంతకుఁ జూచి, జేజియా
బాయి మదిన్ మరల్చి, "యొకపాపముఁ జేసితినేమొ! తెంపునైఁ
బోయె; సహాయమేదయినఁ బుట్టునొకో! కులదైవతంబు కా
త్యాయనియే మమున్ మనుప నాదరు" వంచు నిమీలితాక్షియై॥

తే॥ "ఉడికిపోయినమనసులో నోర్మిలేక,
పుట్టినింటిమమత్వ మాపుకొనలేక,
దుడుకుచేసితినేమొ! యీయెడరుఁ బాపి
చేరఁదీయుము, విభుని రక్షించు తల్లి!"॥

చ॥ అని పరమేశ్వరిం గొలిచి, యారట మూటకట్టి మూఁగఁబోవ, నా
థునివిజయంబు నభ్యుదయదోహదమున్ దలపోయుచుండె; నో
పినకడఁకన్ షహాజి తలపెట్టిన కర్జముఁ బ్రోవలెత్తి, మి
త్రునిఁ గనఁబోయె జున్నరుకు, దూరవిచారసహస్ప్రహాయతిన్॥

## షాజీప్రతీకారప్రయత్నము — రెండవవివాహము

ఉ॥ వచ్చిననెయ్యునిన్ గరమువట్టి, మనంబునుబ్బి, లోనికిన్
జొచ్చి, గతాగతమ్ములగుచొప్పులెఱింగి, భవిష్యదర్థమున్
దర్చి, హితాహితమ్ములఁ దిరమ్ముగనారసి, శ్రీనివాసరా
వచ్చపుఁజెల్మికల్మి యలరార వచించె నుదారధోరణిన్॥

చ॥ "జరిగినదానిలోఁ గల దసహ్యావిషం బమృతంబుఁగూడఁ; దొం
దరపడరాదు; వార్ధిమథనంబున మందర సర్ప కూర్మ శం
కరులును మోహినీసతియుఁ గావలెఁ: ముప్పదిమూఁడుకోట్ల ని
ర్జరు లొకత్రాడు లాగవలెఁ: ద్రాగవలెన్ సుధ; లక్ష్మి రావలెన్

ఉ॥ ఉన్నవి కొన్నిసాధనము, లోర్పుమెయిన్ సమకూర్చుకోఁదగున్
గొన్నిటి; గడ్డిపోఁచలను గూర్చి పెనంచిన మత్తుటేనుఁగున్
బన్నఁగవచ్చు; నామతముఁ బట్టుము, సర్వసహాయసంపదల్
మున్నుగఁబెట్టి నీదుతలఁపున్ గెలిపించెదఁ; గొంత యాఁగుమీ!॥

సీ॥ నా సేన నీదుసైన్యము చేరిపోరినఁ
జాల, దీయరుల గగ్గోలువఱుప,
మహితుండు నీమేనమామ 'వెంకోజి నిం
బళుకరుఁ' డతనిఁ జేపట్టవలయు;
బలియుండు గుంపెఁడుబలఁగమ్మువాఁడు 'బా
జీమోహితే' వానిఁ జేర్పవలయు;
వారిసాహాయ్య మేర్పడినచో మనకత్తి
కెదురొడ్డువాఁడు లేఁ డింతనిజము;
తే॥ గీ॥ అందు 'బాజీ' దలంచినాఁ డతనిచెల్లె
లల 'తుకాబాయి' నీకు నిల్లాలిఁ జేయ
ననుమతింపుము నీవు; నే ననువుపఱతు
నదియు నిదియును, నూతనాభ్యుదయభంగి॥ 190

॥ ఒక విడఁదీయరాని కొతుకున్నది నీకును నాకుఁగూడఁ: దా
నికిఁ దగునుత్తరంబు గమనించుట నీపని; నాకుఁ దోఁచినం
తకుఁ దగుధర్మ మందు బహుదారపరిగ్రహ మిష్టు; నీవు నా
ముకతనెసంగి మాఱువలపుంగొన, విందున దోసమున్నదే?॥ 191

॥ ప్రణయోపాసకులైనదంపతుల తాత్పర్యంబు వ్యాఖ్యాత కం
దని యానందమయాద్వయంబ; యనుసంధానమ్మునన్ నేర్పుమిం
చినవా రన్నిసమన్వయించి, విజయశ్రీఁగందు; రీప్సిన నీ
మనసున్ దగ్గఱి, జీజియాఁదలఁచి, సౌమ్యం బుత్తరం బీఁదగున్॥ 192

॥ కడఁకన్ బూనిన కార్యనిర్వహణదీక్షాదక్షతన్ బెంచు; మి
ప్పుడు పేరందినవానిలో మొదట దీ 'మోతే' కులం, బిట్టి వం
గడపుంజుట్టఱికంబు మే ల్దలఁపు; మేకగ్రీవమిత్రుండనై
యడుగంబూనిన నన్నుఁ జూడుము కుమారా! సమ్మతిన్ జూపుమా!"

తే॥ గీ॥ అనెడుచెలికాని వేడుకో లవధరించి,
ముందువెనుకు బాగోగుల సందడించి,
యరమరలువాయఁ బ్రిణయమర్మరము లణఁచి,
పొందికలుమీఱ, షాజీవిభుండు పలికె॥

మ॥ "సుకముగఁ గష్టముఁగూర్చి నేఁ దలఁపఁ; గ్రచ్చుల్ గ్రుచ్చు లేమైన,
మకునై కార్యముఁ గొంటి, దానిగెలిపింపన్ నిన్నుఁ బ్రాపించితిన్
లుకజీ పోయినమీఁద నీ వతనియట్లున్ నాకు సర్వార్థసా
ధకుఁడౌ మామవు, నేనుసాధనమ, సాధ్యం బెల్లొ సాధింపుమీ!॥

చ॥ ఎఱుఁగుదు జీజియామది; యొకింతతొనంకనికుండ, కార్యబం
ధురతయెఱుంగు, నా నడచుత్రోవ లెఱుఁగు, మఱుఁగు లేదు;
న్నఱచియయుండె నామతముఁబట్టఁగ సమ్మతి; నైన నామె నే
నరయుదు, నీవు నీతలఁచినట్లుగఁ గార్యము సాగఁదోలుమీ!"॥

చ॥ అనుషహాజీనుడుల్ విని, మహాముదమందుచు శ్రీనివాసరా
వనుపదమేగి, కార్యగతులన్నియు సిద్ధముసేసి, పెండ్లిపె
త్తనమున నిల్వపేకయును దానయి లగ్నముపెట్టె; జీజియా
యనుమతి మెల్లఁగైకొనె షహాజియుఁ, బెండ్లికిఁబోయి రెల్లరున్॥

తే॥ గీ॥ పరిణయోత్సవ మతివైభవమున జరిగ
విందువేడుకల్ గొని బంధువితతి యేగఁ
బ్రితినెనెరవేర్పఁ దొందరపడి, షహాజి
శ్రీనివాసరావును జెంతఁజేరి పలికె॥

## నైజాముపై షాజీదండయాత్రలు — విజయము

చ॥ "అనుకొనియున్న శత్రువిలయం బను హోమముఁ దీర్పకుండఁ,
అని కసిరేఁగ వారిరుధిరమ్ము వసంతము లాడకుండ, భో
రన జయలక్ష్మిఁగైకొని పురమ్మున నుత్సవమేగకుండ, నీ
వొనరుచుపెండ్లి పూర్తియగునో? యవశిష్టము నిర్వహింపుమీ!॥

సీ॥ అహమదునగరరాజ్యంబు కల్లోల సం
కులమాట నిది యనుకూలవేళ;
యటఁ బ్రిధానామాత్యుఁడైన ఫత్తేఖాను
చెఱఁబెట్టఁబడియె; వజీరుపదవి
రాఁబట్టెఁ ¶ దన భార్యరాయబారమ్ముల
నంపి 'హమీదుఖా' ననెడియవనుఁ;
డతఁడును సులతానుఁ డనువుగాఁ బిలిపించి,
వంచించి మానుఁ జంపించినాఁడు;
తే॥ మొన్న జున్నరుప్రాంతముల్ గొన్నయప్పు
డన్నఁ దాఁకిరే? భయముఁగొన్నారుగాక:
నేఁడుమాత్రి మద్దనువచ్చునే నిజాము
బలము? బలమఱి దొంగపోటులకు మగ[illegible]॥ 200

॥ అది యటులుండె; లోఁ గలఁతలఁటి బిజాపురరా[illegible] మీఁది[illegible]
గదుపఁగ లేదుపాదము; మొగల్బలఁగం [illegible], [illegible]
గుదిరినచోట; నిట్టు లనుకూలము లెంచితిఁగాని, [illegible]
గదిసినఁగూడఁ బైపడి తెగంగొన నూరక [illegible]నిష్ఫలము? 201

॥ ఊరక కాలముం గడపు టొప్పను; సైన్యములెల్ల [illegible]
జేరిచి, సర్వసాధనవిశిష్టముగాఁ బలుమొగ్గరంబులన్
దీరిచి, నీవు సేన కధినేతవుగా మును మోహరింపు [illegible]
భేరిని వేయఁబంపు, మరివీర విచారణ [illegible]॥ 202

---

¶ Khafi Khan says that Hamid Khan, an Abyssinian oble, who had risen to power on account of the fascination f his wife's beauty upon the Sultan, succeeded Fatteh han as Vizier.

Page 23. "The Life of Sivaji Maharaja", by
N. S. Takakhav, M. A.

సీ॥ నాచేతనుండె 'పూనా' 'సుపా'జాగీరు;
జున్నరుప్రాంతముల్ గొన్నవయ్యె;
నిపుడు 'బారామతి' 'యిందపూర్' ప్రాంతమ్ము
లరికట్టి, కొంకణ మాక్రమింత;
మింతటితో మూఁడువంతులు చేకురు
నహమదునగరరాజ్యమున మనకుఁ;
దక్షిణభాగమ్ము దక్కుఁ దనంత నే,
విడువనిపూనికిఁ బైఁబడితిమేని;
తే॥ గీ॥ గాలిమేడలుగావివి, కావటంచు
రుజువుసేయుము, రిపులమారొక్కనుము నేఁడు"
యనుచు షాజీ వచింప, మిన్నంది యతఁడు
సకల సైన్యసన్నాహముల్ సంతరించె॥
సీ॥ ఒఱపాడు తరఁగతంపరవోలె గుఱ్ఱపుఁ
బౌజులు మున్ముందు పరుగువాఱఁ,
దళతళలాడు నీఁటెల బారులనుదీరి
వీరపదాతులు వెంటనడువ,
శంఖచక్రములట్లు చక్రరక్షకులౌచు
మఱఁదియు మిత్రుండు నొఱపుసూపఁ,
బెనఁకువఁ గాఁకదీరిన మరాటావీరు
లంగరక్షకులౌచు ననుసరింప,
తే॥ గీ॥ నుత్తమాశ్వంబుపై మధ్యమోర్వి నిలిచి,
పెండ్లియుడుపుల నిన్నటిపెండ్లికొడుకు
నేఁడు వీరవిహారసందీప్తుఁ డగుచు,
నడిమి షాజీవిభుండు సైన్యములఁ దఱిమె॥

ఆమడలామడల్ దఱిమియాసుచుఁబోయి పరాక్రమించి, 'బా
రామతి' 'యింద్రపూర్' పరిసరమ్ములఁ జుట్టుముట్టి, శాత్రవ
స్తోమముఁ బిల్కుమార్చి, పటుదుర్గములన్ గయికొంచు, రాజ్యము
ద్దామత నాక్రమించె నరితండముగుండెలు తల్లడిల్లఁగన్॥ 205

జరుగుషహాజివిక్రమము చారులుదెల్ప, హమీాదుఖానుఁ డా
తురపడి తద్విజృంభణముఁ దోలఁగ సేనల సైన్యనాథులన్
దఱిమె; షహాజి వారిబలదర్పము లాఱఁడిఁబుచ్చి, కొందఱన్
దఱిమె యమాలయంబునకుఁ, దక్కినవారి నిజామునుఁ జేరఁగన్॥ 206

చిక్కినదానితోఁ దనివిఁజెంద, కహమ్మదురాజ్యసీమకున్
బ్రిక్క బిజాపురాంకమగురాజ్యములో నెలకొన్న 'షోలపూ'
'రక్కలకోట' 'గుల్బరగ' యన్ పురముల్ గొనుచున్, నిజాములోఁ
జెక్కులు దుర్గముల్ గెలిచి, పెంపునఁ గొంకణభాగముల్ గొనెన్॥

ఇటుబలశాలియై రిపులనేఁచి, స్వతంత్రము రాజ్యలక్ష్మి న
చ్చట నెలకొల్పి, యాప్తులయి సాయముఁజేసినవారి నాదగో
తక్కట బహుమానమానితముగాఁ దనుయూళ్ళకు సేనకొల్పు; న
ప్పటి షహాజీ కడంకవిని పాదుషహా యిటులంపె సందేశమున్॥ 208

"విపుల భవద్భుజాబలము వింటిమి: దక్షిణమందు మా ప్రభు
త్వపు టధికారివై నిలుము: ద్రవ్యములన్ఫలు రోజులు, సేన యు
చ్చపుహారు లైదువే లిడెద: జాగిరుగాఁ 'దలిసేను' ప్రాంతముల్
తపతికి దక్షిణమ్మున స్వతంత్రముఁజేసెద; సమ్మతింపుమీా!"॥ 209

ఈగతిఁ బాదుషాపిలువ, నిచ్చకునచ్చనిదయ్యు సుగుణా బా
గోగుల కూఁతగాఁదలఁచి యూఁకొని, తాకొనియున్న రాజ్యము
దాఁగని యేల్బడిన్ నడిపి, యందకతక్కు నిజామురాజ్యమున్
లోఁగొనఁబూంచి, తత్సమయలోచనుఁడయ్యె షహాజి యచ్చటన్॥

సీ॥ 'అహమదునగరరాజ్యమునెల్లఁ గైకొనె
షాజీ, హమీదుఖాన్ చాలఁడయ్యె'
నని నవాబైన బర్హానునిజాముషహా వ
జీరు పత్తేఖాను చెఱనుబాపె;
నతఁడు సమర్థుఁడై యదియది సవరించు
నంతలోన నవాబుహత్య జరిగె;
నిదియుఁ బత్తేఖానుఁడే చేసెననిమోపి
బిరుసెక్కి ప్రజలెల్లఁ దిరుఁగబడిరి;
తే॥ గీ॥ రాజ్యమెల్లనఁ దనప్రాణరక్షణంబుఁ
దలఁచి, యాతఁడు మొగలుకొలువుఁ జేరఁ;
దఱియెఱింగి షాజీ యమాంతముగ దూఁకి
తలుపులేనినైజామెల్ల గెలిచికొనియె।

ఉ॥ మామనుజంపనైనకసి మాసె, నిజామునవాబు పోయెఁ, జే
రామునఁ ద్రుళ్ళిపోయిన యహమ్మదురాజ్యము చేతఁజిక్కె; సు
గ్రామకిరీటియై రిపులఁగ్రాఁచి ప్రతిజ్ఞను నిర్వహించి, షా
జీ ముదమందె, - నింతపనిచేసిన యాత్మసతిన్ దలంచుచున్॥

ఉ॥ పూవులకన్నఁ గోమలము, పూజ్యము, భారతభూ పవిత్రతా
దైవము; సుప్రసాదమిళితంబుగ నాయమ చూచెనేని, సు
శ్రీవిభవమ్ములన్ గురియు; రేఁగి కనుంగవ జేవురించినన్,
గావిరిగుప్పునిప్పు లుబుకన్ జగమెల్ల దహింపకుండునే?॥

చ॥ జరిగిననాథుగెల్పువిని, సంతసపున్నుడిఁ బంపె జీజియా
తరుణి: తుకావధూటికి సుతప్రభవంబనువార్త వచ్చె; దాం
తరగొనివచ్చు నభ్యుదయధన్యతకున్ గుఱియై, షహాజి చే
కురిన నిజాములక్ష్మిమఱుఁగుల్ గొనెఁ జిక్కులువాయ దువ్వ

తే॥ గీ॥ అచటిసరదార్లు తక్కినయవనిపతులు
ప్రజలు కనుకట్టువడకుండ, $ బాలునొకని
రాజుగాఁజూపి, తా స్వతంత్రతను నడిపె;
నెఱిఁగె మోగలుపాదుషా యీయెడలఁగు॥ 215

## మోగలులు పాజీపై దండెత్తుట

మ॥ తెగువన్ జేరఁగవచ్చి తన్ గొలుచు పత్తేఖానుఁ జేపట్టి, మ
ర్మగుఁడౌ నాతనిచే నిజామును జయింపన్ వచ్చు నంచెంచి, ము
దుఁగ పాజీకిడు జాగిరున్ బదవిఁ దోడ్తో వాని కిప్పించి, యా
మొగలుంబాదుషహా నిజాముపయికిన్ బుత్తెంచె నాసీరునిన్॥ 216

ఉ॥ వాదరదీరియున్న పరివారముతో సతఁజేగి, దాలతా
బాదును ముట్టడించి యటఁ బ్రాంతములెల్లను లోఁగొనంగ, పా
జీ దురతిక్రమంబులగుసేనలతో నెదిరించి మించె; నీ
రాదరణీయవైఖరి మహాహవ మచ్చటఁ జెల్లె నారికిన్॥ 217

చ॥ మిడుతలదండువోలె బలిమిన్ బయిపైఁబడి నేలయీనినా
ట్లడరుచునున్న మోగలుబలాంబుధి సిండఁగ నోహటించి, రా
వడి నిలుచున్నసైన్యములపాటు దలంచి, షహాజి సాహసం
బుడిగి నెపంబువెట్టి, సమయోచితభంగి రణంబు వెల్వడెన్॥ 218

వ॥ "అహామదుపట్టణం బరిగినంత ఫలం బిసుమంతలేదు: నా
స్నహరిపులన్ జయింపఁగ బిజాపుర మేగి, సురాసురాదు నా.
సహచరు సాయమున్ గొనుచు శాత్రవులన్ బరిమార్తు" నంచు స
స్పృహుఁడగుచున్, షహాజి యనిపిన్ బిజాపురంబునకు వెడలెన్॥ 219

---

$ The Maratha chief (Shahji) took out of the fort udhan a Nizam Shahi prince named Murtaza Nizam Shah II ged 10 or 11 years ... and carried on the government for ıree years. 'The Modern Review' September, 1917.
Prof. Jadunath Sarkar, M. A., F. R. S.

సీ॥ చాలకాలమునుండి సమయంబు వేచిన
పాదుషా కిది మేటిపంటగ య్యె;
నహమదునగరరాజ్యము బీడుపడియుండె
నొకరిలో నొకరు లేకునికఁ జేసి;
సులతాను మరణించె; శూరుఁడు మంత్రి ప
త్తేఖాను మొగలుతేరు నడిపె;
మొన మొన్న రాజ్యంబుగొనిన షాజీ నేఁడు
బలమఱి పరులపంచలకుఁ బాఱె;
తే॥ గీ॥ 'అదనిది' యటంచు మొగలు సైన్యములు కట్టె
తెగినచెఱువునీరముఁబోలె దేశమెల్ల
ముంచుకొనిపాఱె, జనుల బాధించుకొనుచుఁ,
దఱిమె షాజీని శివనేరుదాఁటిపోవ॥ 220

జీజియా మొగలుల దాడినుండి తప్పించుకొనుట.

తే॥ తఱుముకొనివచ్చు మొగలుదాడి నెఱిఁగి,
జీజియా తన్ను సుతుని రక్షించుకొనుచు,
నిన్న శివనేరు, మాహులి నేఁడు, రేపు
కొండనాగడ, మిటు మార్చుచుండె వసతి॥ 221

మ॥ తమకుంజిక్కినయూళ్ళు కొల్లగొని, పేదల్ సాదు భంజించి, దే
శము గగ్గోలొనరించి, మొగలులు 'వైజా' పట్టణంబుం దప
త్యముతో డాఁగినజీజియా నెఱిఁగి, తొల్తన్ వారిబంధింప ను
గ్రముగా ముట్టె; రదల్చి యామె కసి రేఁగన్ వారివారింపుచున్॥ 222

శా॥ "ఏమీ! మొగలుపాదుషాప్రభుతయిట్లే? శూరధర్మంబు కాం
తామర్యాదకు భంగముఁ దలఁచు టౌనా? రాణివాసంపు 'గో
షా' మన్నించు మహమ్మదీయు లిటు స్వేచ్ఛన్ జొత్తురే? లేదు కా
దా మీ కొండొక యాఁడుతోఁ? డిదియె మీకౌనేని మీరోర్తురా?॥

ఉ॥ ఈఁటెలదూసి, బల్లెములనేసి, ఫిరంగులుమోసి, శేఁతకుం
దేటని వేఁటలాడుమగదే బెలు కయ్యము లాడ నేటికో!
కూటికి బిచ్చమెత్తుకొనఁగూడదొ? కూలికి గుంజమెక్కఁ—న
య్యాటములేల? హైందవకులాంగనఁదాఁకినఁ దక్కఁబోదురే?॥ 224

ఉ॥ తోడటియున్ననన్ను విడఁద్రోయుచు, నాసుతుఁ బట్టనుంటిరే
యోడక? దూడపైనఁ గరమూఁదిన బెబ్బులిపైనఁ గొట్టి గో
రాడుచుఁ గొమ్ములన్ జెలిగియార్చుచుధేనువుభంగిఁ, గాళికా
క్రీడనముల్ వెలార్చి విహరించెద; నష్టముదాఁకి చూడుఁడీ!॥ 225

తే॥ సతుల గోవుల విప్రసంతతుల సురలఁ
గసురుఁగండలఁ గలఁచి, యిక్కట్టులువఱచు
తులువకొలములఁ దుడిచి, తుందుడుకు లడఁచు
కాళికాదేవి మిమ్ముల గావుగాత!"॥ 226

మ॥ అను జీజాపలు కాదరింపక తురుష్కానీకినీనాథు లా
మెను బుత్త్రిన్ జెఱఁబట్టఁగాఁదలఁచి బల్మిన్ బట్టి; రాలోన సం
దునఁ గొల్వున్నమరాటవీరులు 'బహాదూర్జీ' 'మహాదేవజీ'
యను జీజాపితండ్రి యన్నయగువా రడ్డంబుగా నిల్చుచున్॥ 227

చ॥ "ఇదివినుఁడయ్య! యీయబల యేయపరాధ మొనర్చె? షాజిపై
నొదవినయగ్గి నీమెపయి నూఁదఁగనేల? కృతఘ్నుఁడాతఁ డీ
పెఁ దలఁపుఁగొట్టి, వేఱొకతెఁ బెండిలియయ్యె; నభాగ్యభిన్నయై
బ్రదు కెడరోయు నీమెఁ జెఱఁబట్టి కఠోరముసేఁత మంచిదే?॥ 228

ఆ॥ వె॥ పరువులేదుదీనఁ; బాదుషామెచ్చఁ; డీ
వనిత విడువుఁ" డనఁగ, వార లట్లు
వెడలి; రామె జరుగువిధమెల్లఁ బతికి వి
న్పించి, సుతున కుగ్గువెట్టుచుండె॥ 229

## బిజాపురమంత్రి మురారిపంతు షాజీకి సాయమేగుట

చ॥ అచట బిజాపురమ్మున మహాసచివుండు మురారిపంతు దా
నిచటి యుదంతమెల్లవిని, "యిట్టులె మొగలుదంపు సాగునో,
బ్రిచలితమానొ యేమొ మనరాజ్యముగూడ; నిజాము త్రోవహూ
నిచటికిరాఁగ; దాని నిపుడే బలితమ్ముగఁజేయు టొప్పదే!॥ 230

క॥ మనలోమన మెటు తగవులఁ
గొనుచున్నను సహజవైరి గూడినచో నా
తనిఁ దఱుము టొప్పు; షాజీ
కనువుగ సైన్యముల సాయమంపుట తగదే!"॥ 231

చ॥ అనితలపోసి, యీవిషయ మల్లనవాబున కెక్కఁబల్కి, యా
తని పనుపొంది, సేనఁగొని తత్పరతన్ జనుచుండి, దారిలో
వినియె మురారిపంతుఁడు 'రవిగ్రహణంబను పర్వవేళనేఁ'
డని; మదినెంచె స్నానము సమంచితదానము లాచరింపఁగన్॥ 232

క॥ "ఇది యింద్రాణీ భీమా
నదులు గలియుచోటు, పావనంబు 'తులాపూర్'
పొదలునిట" ననుచు నాతఁడు
నది మునుకలువెట్టి తర్పణంబులు సలిపెన్॥ 233

ఉ॥ ఏనుఁగుతూఁగునంతధన మెత్తుచు దానముసేయఁగోరి, యా
యేనుఁగుఁ దూఁచునట్టి వెరవేది, మురారి తలంచుచుండ షా
జీ; నతఁ డింతలో నచటఁజేరెఁ; బరస్పరకార్యగౌరవా
ధానత ముచ్చటించుకొని, తత్పరులైరి గజమ్ము తూఁచఁగన్॥ 234

తే॥ ఓడలో నేన్గునెక్కించి, యోడమునుక
నీట గుర్తించి, దానికి దీటుధనముఁ
జేర్చి తూఁచుట షాజీ వచింప, నతఁడు
మెచ్చి యారీతి దానముల్ పెచ్చుసలిపె॥ 235

చ॥ పదపడి కర్జముఁ గాని, యపారధనంబు ననంఖ్యసైన్యసం
పద సమకూర్చి, "శత్రుబలవాహిని వెన్కకునెట్టి నిప్పుడే
కదలుద" మంచు నుత్సుకత గప్పడ మంత్రి మురారి వల్కఁ, న
భ్యుదిత భుజావిజృంభణ సముస్థితిమీఱ షహాజి నవ్వుచున్॥ 236

తే॥ "ఇట్టి మీయభిమాన మొకింత చాలుఁ;
జాలు షహాజీ యొకండె యీశత్రుబలము
బడలువడఁజేయ; సేన తోడ్పడినఁ జాలు"
నన, మురారియు నతని ధైర్యమును మెచ్చి॥ 237

ఉ॥ "నడుపుము సేన, శత్రుబలనాశము సేయుము; నా సహాయ మె
ప్పుడు వలెనన్నఁ దత్క్షణము పుచ్చెద, నీవు నవాబుచెంత నా
కుడియెడ నున్న తాసనముఁ గూర్చెదఁ, గోర్కెలు తీర్చెదన్, వెగం
బడి విజయమ్ము నిమ్మదె" మ్మనుచుఁ బల్కె, మురారి షహాజి నంపెనన్॥ 238

ఉ॥ అతిమతి నేగి వెన్నటిమి, యాతఁడు మొగలు సేనముట్టి, చి
చ్చుఅపిడుగట్లు దాఁకి, పెలుచన్ గలఁచన్, గలుషాసలేక 'యూ
పిరి గలదేని యుప్పుఁడినియుండఁగవచ్చు' నటంచు మొగలుల్
పరువులువెట్టి; రిట్లు తెగువన్ బలుమాఱులు దోలె వారలన్॥ 239

మ॥ డాబుల్గొట్టుచు మొగలుల్దగి 'పరెండా' ప్రాంతముల్ముట్టి, 'క
ర్కె' బాధించి, 'నిజాము' దొన్నిగొనుకోర్కెల్ బల్మిఁ ముట్టి, షా
జీ బాహాటముగా నెదిర్చెఁ, దటిమోన్, జీకాకుగావించె; న
లో బీజాపురమందు మెండుకొనెఁ గల్లోలంబు లొక్కుమ్మడిన్॥ 240

తే॥ పలుకుబడిపై బిజాపురప్రభుతనడుపు
మంత్రిని మురారిపంతు, నమాత్యుఁ 'గవను
ఖాను' నోర్వక యొంటిపాటూని, హత్య
సేసి రాకొల్పులోనున్న చెనఁటిదొరలు॥ 241

### నైజాముపై మొగలుల పునర్దండయాత్ర — షాజీసంధి

ఉ॥ రెక్కలు లేని పక్షివలె రిచ్చవడెన్ షహాజీ విభుండు; లా
వెక్కుచు మొగలుల్ సమయమెంచి బలమ్ములఁ బెంచి, యొక్క
దక్కను నెల్ల మ్రింగ బలితమ్మగు పూనికమించి, దిక్కులన్
బిక్కటిలంగ దండు నడిపించిరి దక్షిణ పీఠభూమికిన్॥

మ॥ సరదారుల్ పదివేలు గొల్వఁగ 'సయిస్తాఖానుఁ' డొక్కంట, ము
షర్రుఁడౌ 'ఖానుజమనుండు' వేఱొకట, మొగల్ సర్వసేనానులై
తరఁగల్ వోలె బలమ్ముల న్నడిపి, చెంతన్ 'దౌలతాబాదు' 'జు
న్నరుఁ' 'గర్కి' 'నహమదునగరంబును' 'బరెండా' సన్నిటిన్ ముట్టిరన్

క॥ కనుచూపు మేర నెందును
గనఁబడి కేకిసలు గొను మొగలు సైన్యంబున్
గనుఁగొని, షాజీ నివ్వెఱఁ
గొని, యుద్ధము సేత మానుకొని, యిటు దలఁచెన్॥

సీ॥ "కసివెట్టుకొనుచు మొగలు పాదుషా యఖం
డముగఁ బల్మఱు దండు నడిపె నిచట;
నహమదునగర రాజ్యము లోనఁ గుర్ఘువ
ట్టుచు నెత్తురోడి గోదావరి పాఱెఁ;
బ్రాపుగానున్న బిజాపురమంత్రి ము
రారితోఁ దదుపకారములు దీఱె;
ననవరతంబుఁ గయ్యములాడియాడి నా
బలములెల్ల నలంత సొలసిపోయె;
తే॥ నొంటి తెగువఁ బైపడి మొదలంటఁ జెడుట
నీతిగా" దని షాహాజీ నిశ్చయించి,
బీజపూరుసుల్తానుల పెత్తనమునఁ
బాదుషాగారితో సంధి పాదుకొలిపె॥

తే॥ గీ॥ ఆలనిజాములో నర్ధరాజ్యమునకన్నఁ
బయిగఁ గైకొని, షాహజీపట్టుకొన్న
¶ యాఱుదుర్గముల్ దనవిగా నాక్రమించి,
దండుమరలించి పాదుషా తరలిచనియె॥ 246

తే॥ గీ॥ జరుగుసంధిలోఁ బాదుషా సంగ్రహించు
కొనినరాజ్యముగాక, తక్కినదియెల్ల
సాయమొనరించి యాదిలుషాహి గొనియె;
నంతనైజామురాజ్య మిట్లంతరించె॥ 247

చ॥ అనుకొని సగ్గుగాక కొఱనై తనకార్య మడంగ, షాహజీ
తనయునిఁ జూడనైనను బదంబు మరల్పకపోరి, పాదుషా
మనసుమరల్చి, ¶ కొన్నిబహుమాన చమూ ధన గౌరవాదులన్
గొని, రణరంగముల్ విడిచి, కొండొకతీరుబడిన్ దలంచుచున్॥ 248

మ॥ తనకున్ నిల్చిన సొంతజాగిరుల చెంతన్ నిల్చియుండంగ, నా
తనిబల్మిన్ గనుచున్ బిజాపురపు సుల్తా నంతలోఁ బిల్వఁ బం
ప, నతం డచ్చటికేగి యందుఁ గలఁతల్ వారింపుచున్ శాంతిని
ల్పిన, సుల్తా నదిమెచ్చికొంచ తని నల్పన్ దొడ్డసర్దారుగన్॥ 249

ఉ॥ సాటియొకింతలేనిబలశాలి షహాజి నవాబుపంపెఁ గ
ర్ణాటకదండయాత్రకై; బవరమ్ముల దేరిన రంగరాయఁడా
మేటి నెదిర్చితాఁకె; గడిమించి కలంచి షహాజి వాని పో
రాట మడంచి, పూర్ణవిజయంబున వచ్చి, నవాబుఁ గన్గొనెన్॥ 250

¶ He entered the Bijapur service and gave up to the
ughals his Nizam Shahi princeling, together with Junnar
d six other forts still held by his men. Evidently he got
od terms out of the Imperial Government.
Page 48. "History of Aurangzeb"

సీ॥ మహామదాదిలుశాహి షహాజీపరాక్రమ
మగ్గించి, మేటిమర్యాద సలిపెఁ;
గన్నడమ్మున గెల్చుకొన్నప్రాంతములెల్ల
నతనిజాగీరుగా ననుమతించెఁ;
* దనరాజ్యమందు 'రత్నపురంబు' 'దేవగడ్'
'మావళా' మొదలుగా మాన్యమిచ్చెఁ;
చేర్మి నీరానదీ భీమానదులమధ్యఁ
గలదేశమున కధికారిఁ జేసెఁ;
తే॥ గీ॥ దనమహారాజ్యసర్వతంత్రములు నడుపఁ
గుడిబుజమ్ముగాఁ గొల్విచ్చి కుదురుపఱచె;
నిటు బిజాపురరాజ్యమం దెలమిఁగొనుచుఁ
జెలఁగె బల్మినిఁగల్మి షాజీవిభుండు॥

ప్రథమాశ్వాసము — సంపూర్ణము.

---

* Not long after, the districts of Ratanpore, Deog
Kanakgiri and Raidurg were added to his jagir (alre
given in the Carnatic) and his Maharashtra jagir likew
received the addition of Indapur, Baramati and Maval.
addition to all this, the deshmukhi of twenty-two vill
in the Karhad district was conferred upon Shahji..

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీ శివ భా ర త ము

## (శి వా జీ ప్ర బం ధ ము)

ద్వి తీ యా శ్వా స ము.



చ॥ జరిగిన సంధిమేరకు నిజాముబిభాగ్య మడంగె; సందు ను
త్తరమునఁ గొంతభాగమును దక్కె-నె మొగలుపాదుషా; బిజా
పురమునఁ జేరె నందువిడిపోయిన దక్షిణమెల్ల; నంతఁ దా
మొరయుచు రెండురాజ్యములు నొంటొకటిం గబళింప మెల్గొనెన్॥

క॥ ఈ రెండు రాజ్యములను మ
హారాష్ట్రం బడఁగియుండె, యమునా గంగా
పూరాంతర్లీన నిరా
కార సరస్వతియ వోలె గణనా గుణమై॥ 2

మ॥ ¶ అమితప్రాభవులౌ మహారథులు పెంపారన్ మహారాష్ట్రరా
జ్యము మున్నేలిరి, — దక్షిణోత్తరము కృష్ణా తాపతీ మధ్యభా
గము, పూర్వాపరదిగ్విభాగము 'పెయింగానా' నదీభాగ ప
శ్చిమ వారాన్నిధిమధ్య; మీయవధి నిల్చెన్ నాఁటికిన్ నేఁటికిన్॥

తే॥ కొంకణము, సహ్యపర్వతశ్రేణి, దాని
తూర్పు పీఠభూమియు, నిన్ని దొరసి కొనుచుఁ
దత మహారాష్ట్ర రాజ్యాభిధాన మందు;
నిదియు రంగస్థలము మనచదువు కథకు॥ 4

¶ The name Maha-rashtra was confined to the Western edge of the Deccan plateau, bounded on the north by the Tapati, on the south by the upper courses of the Krishna and on the east by the Sina.

Page 2. "Sivaji and his times" by J. N. Sarkar.

సీ॥ * ఒకగీత, - 'నందోడు' నుండియు సాత్పురా
కనుమలవెంటఁ దూర్పునకుఁ బోయి,
యట 'వెయింగానా' మహానదివెంట ద
క్షిణము 'వార్ధా' నదిఁ జేరుదాఁక
నడిచి, యచ్చటినుండి పడమర 'మణిపురు'
'మాహోరుఁ' జేరుచు మరలి, దక్షి
ణమున 'బీడారు'కు నడిచి, యాపైని ప
శ్చిమము 'షోలాపూరుఁ' జేరి, యచట
తే॥ దక్షిణముమళ్లి, కృష్ణనుదాఁకి, వక్ర
గతిని మూలగా 'గోవా'ను గలియవలయు;
నుత్తరమునుండి యీరేఖ నొదిఁగియున్న
ధర మహారాష్ట్ర, మపరాబ్ధి తటము వఱకు॥
సీ॥ అటు పశ్చిమాంబుధి, యిటు సహ్య పర్వతం
బీరెంటి నడుమ విస్తారభూమి
కొంకణదేశమై కొమరారుఁ, బొడవుగా
నుత్తర దక్షిణా భ్యున్నతమయి;
పైరుపచ్చల కంత సారవంతముగాని
వెలినేల గులకఱాల్ గలదియైనఁ,
బలురకంబుల పూల పండ్ల గుత్తులుప్రేలు
రమ్యత రోద్యానరాజి గలను;
తే॥ ఎండలో వానలోఁ దపముండియుండి,
దైవమునునమ్మి జీవితాధ్యాయ మెల్ల
జరుపు నిరుపేద రైతు కాఁపురము లిచటఁ
గలవు, గుడిలేని శంభులింగముల కరణి॥

* Historical Atlas of India by Charles Joppen, S. J.

చ॥ ఉఱుముచుఁ బశ్చిమాంబునిధి యూర్మిక లొండొరుఁ ద్రోపులాడఁగా
బెరసినయుప్పు, సహ్యాధరపెట్టిన కందలుఁ గాయగూరలున్
బరువపు జీవనంబు నడుపంగ, స్వతంత్రత సొంతసొత్తుగాఁ
బెరిఁగినవీరులై ప్రకృతి పెంచిన బిడ్డలు వొల్తు రచ్చటన్॥ 7

ఉ॥ కొంకణరాజ్యమున్ నిలుపుకోట, సముద్రము పొంగు నాఁపఁగా
నుంకువ గొన్నమేటి, రవియుగ్రత మాపెడు మాంత్రికుండు, ప
ర్యంకమునందు నాడెడు తరంగిణులన్ గని యుబ్బు తండ్రి, ని
శ్శంకపు 'మావళా' నెలవు 'సహ్యము' కొంకణమంటి రాజులున్॥ 8

మ॥ మనకీ సహ్య మహా మహీధరము సమ్మాన్యంబు; శ్రీదేవి శం
భునియిల్లాలిట [1] 'నేకవీర' యనఁగాఁ బొల్పారు; నీశైలకుం
జ నితంబాంత దరీ ఝరీ తటములన్ జాగ్రన్మహారాష్ట్ర వీ
రుని హుంకారము మూలమూల నుఱిమెన్ రూత్క్రియా భీలమై॥ 9

చ॥ పలితములౌ దినాంత రవిభానుల బంగరుసీరచేలు లో
యలు దరు లొప్పు నీగిరి తటాగ్రము లెక్కుచు, మావళీలు దా
పులఁ దొనఁకాడు పశ్చిమ సముద్రపుఁ దుంగతరంగపాళి ము
న్కలుగొను గాలికూనగమి కౌఁగిళులన్ రమియింతు రేతయున్॥

॥ సాద్రి నగంబు తూరుపుదెసన్ వరుసన్ గిరిపాద మంటి, య
ఝుద్రములైన దుర్గములు శోభిలుఁ; దొంటినృపుల్ స్వరాజ్యమున్
భద్రముసేయఁ గట్టి: రివి పాడటి నేఁడు సపత్న మండలీ
ముద్ర వహించెఁ జీమగమి పుట్టలు పాములకైన కైవడిన్॥ 11

---

[1] శ్లో॥ విపులే విపులాదేవీ కల్యాణీ మలయాచలే।
సహ్యాద్రావేకవీరాతు హరిశ్చంద్రేతు చంద్రికా॥

'దేవీభాగవతము' - 7 స్కంధము, 80 అధ్యాయము, 66 శ్లోకము.

సీ॥ పగడాలదండ చెల్వము మించు నాసహ్యగ
విత్తతికిఁ దూర్పుగాఁ బీఠభూమి,
'తపతి' 'యింద్రాణి' 'గౌతమి' 'భీమ' 'నీర' 'కృ
ష్ణ' యు నాటలాడెడు చలువనేల,
'భాండూరు' శిఖరి 'భాస్వానాథ' 'మంబికా
నాథ' మన గిరుల నందమగుసీమ,
పావనక్షేత్రముల్ 'పండరి' 'నాసిక'
'తులజ' 'కొల్హాపురి' వెలయు నెలవు
తే॥ నదుల గట్టుల గుట్టల నెదిగి యొసఁగు
ఫలితవనరాజిఁ గనువిందు గొలుపుఁగాని,
పండి యొఱగిన పచ్చని పైరులిచ్చి
కడుపు విందులు సేయఁ బాల్పడని దవ్యో॥

## మహారాష్ట్రుల స్వభావ - వృత్తి - పరిస్థితులు.

క॥ ఇట్టి మహారాష్ట్రము సిరి
పట్టయి, శౌర్యంబు విడిదిపట్టయి, యరులన్
నెట్టుచుఁ, గీర్తికిఁ బట్టము
గట్టెన్ జనరంజనానుగత వైఖరులన్॥
తే॥ దక్షిణోత్తరములనుండి ద్రవిడు లార్యు
లిందుఁ జేరంగ, నందఱు నేకమగుచుఁ
గ్రమముగా మించి, యొకమహారాష్ట్రజాతి
యందుఁ జెలువారె మిశ్రగుణాశ్రయముగ॥
ఉ॥ ఆర్యులరూపు - ద్రావిడగుణాతిశయంబు - నిసర్గధైర్య గాం
భీర్యము - లేకరూపతను బెంపఁగ, దక్షిణపీఠభూమిలో
నార్యులకన్న ద్రావిడులకన్న దృఢాంగు, లుపాత్త సాహ సౌ
దార్యులునై జనుల్ యశముఁదాల్చిరి దుర్దమకార్యధుర్యతన్॥

చ॥ విడువని దైవభక్తి, తమపెద్దలనాఁటి పవిత్ర ధర్మముల్
నడిపెడు జాతిరక్తి, యెడ నమ్మక సేగి దమించి జీవికన్
గడపు స్వతంత్రశక్తి, కొఱగానులనోర్చి మతంబు దేశమున్
బుడుకు నురుప్రసక్తి, యివి పుట్టుకతోడనె పుట్టె వారికిన్॥ 16

ఉ॥ మంచితనంబు నమ్మకపు మాట హితంబొనరించురీతిఁ గా
న్పించినవారికిన్, దెగువఁ బెంచి శరీరముఁ బ్రాణమైన న
ర్పించి శుభంబుసేఁత, గికురించి నికారముసేయువారి సా
ధించి నిజంబుదెల్పి పగదీఁత, మరాఁటులకున్ నిసర్గముల్॥ 17

మ॥ గుములౌ కొండలయునికి, వాహినులు పెక్కుల్ పొంగి పారాడుటన్
సమ నిమ్నోన్నత మూషరంబు నుపలచ్ఛన్నంబు నిస్సారమౌ
న మహారాష్ట్రమునన్ జనుల్ మనుదు, రెండన్ వానఁ గొల్వుండి నా
ర్ద్రమ యోగంబున నైహికంబుఁ బర మంతర్వహ్ని సాధించుచున్॥ 18

చ॥ నదులు మహీధరంబులు వనంబులుఁ దల్లియుఁదోడుసీడగా
నెదిగినవారలై, జను లకృత్రిమ నిష్ఠురవృత్తి జీవనా
భ్యుదయ పరోపకారముల నోమెడువో మొయిఁబొంగు ఘర్మబు
ద్బుదముల మొగ్గలన్ జిదిమి, దోయిలివట్టుచు రర్ఘ్యమెత్తుచున్॥ 19

॥ విరియని భాషలో నొదుఁగు విద్యలు, చిత్తముకంటెఁ జీవికిన్
బరిచితమైనవిద్య లోకపాటిగ నేరిచి, కావ్యబంధముల్
విరచన సేఁత కంటె, మదివిప్పి రసంబునుగుప్పి, భావనా
పరిణతిఁ దంత్రులన్ గలిపిపాట మరాఁటుల కాటమై తగున్॥ 20

వ్యవసాయంబులు కూలినాలి పనులున్ వాణిజ్య భైషజ్యముల్
వ్యవహారంబులు వృత్తి విద్యలును బూర్వాచార ముద్యోగగౌ
రవముల్ వారును వారుఁబొందిరి మహారాష్ట్రంబునన్; యోగిభా
గవతుల్ మించిరి గొంద, అందఱ నమస్కారంబులన్ బొందుచున్॥

శా॥ 'గోసాయీ' 'బయిరాగి' 'సాధు' వను శాక్తుల్ వైష్ణవుల్ శైవస
న్న్యాసుల్ దేశికులౌచు, నేకులమువారైన మతాచార్యులై
వాసింగాంచిరి; వృత్తిఁబట్టి కులముల్ వ్యాపించి యందున్న, వ్య
త్యాసంబుల్ గొన, రంద ఱొక్కటెగవారై సంఘ మర్యాదలన్॥
తే॥ హైందవ మతంబులోని జీవాణువులను
బాటలను బద్యములనింపి పాడికొనుచు,
సాధుజనులు బైరాగి గోసాయి గములు
గాదె వోసిరి భక్తి యోగామి రక్తి॥

దక్కనులో బహమనీరాజ్యములు — పరిపాలన.

క॥ ఈరాజ్య మేలుచుండిరి
నేరుపుమై నిపుడు 'బహమనీ' సులతానుల్;
పౌరుషము విరియఁ జిమ్మ, మ
హారాష్ట్రులు తోడు నీడలై సాయపడన్॥
ఉ॥ దక్కను భామినీదారలు తా మటు యావనులయ్యు, నెయ్యముల్
మక్కువఁజూపి హైందవుల మానసముల్ తనివొందఁ జేయుటల్
పెక్కుతెఱంగులై, సవతి బిడ్డలు, కౌరవపాండు పుత్రు ల
ట్లొక్క కుటుంబమందలి యయోమయముల్ గనుచుండి రెంతయున్
ఉ॥ ‡ కన్నెలఁ బెండ్లియాడి, యధికారము లిచ్చియుఁ, గొంద ఱందు
యన్నెముఁ బున్నెమెంచక, సహాసన భోజన పానరక్తి మీ
ఱ న్నటి యించి, వారి బయిరాగుల వీరిఫకీరులన్ సమా
నోన్నతి గౌరవించి, రిటు లొండొక నెయ్యము నామతింపుచున్॥

‡ "The Mahomedan rulers in the Deccan took Hindu wives in their harems." (Page 31)

"Some Mahomedan Fakirs have been ranked with the Hindu saints in general veneration and there are some saints who are venerated by both communities alike." (P. 24)

"Rise of the Maratha Power" by M. G. Ranade

శా॥ 'గోసాయీ' 'బయిరాగి' 'సాధు' వను శాక్తుల్ వైష్ణవుల్ శైవస
న్న్యాసుల్ దేశికులౌచు, నేకులమువారైనన్ మతాచార్యులై
వాసింగాంచిరి; వృత్తిఁబట్టి కులముల్ వ్యాపించి యందున్న, వ్య
త్యాసంబున్ గొన, రంద ఱొక్క తెగవారై సంఘ మర్యాదలన్॥

తే॥ హైందవ మతంబులోని జీవాణువులను
బాటలను బద్యములనింపి పాడికొనుచు,
సాధుజనులు బైరాగి గోసాయి గములు
గాదె వోసిరి భక్తి యోగామి రక్తి॥

దక్కనులో బహమనీరాజ్యములు — పరిపాలన.

క॥ ఈరాజ్య మేలుచుండిరి
నేరుపుమై నిపుడు 'బహమనీ' సులతానుల్;
పౌరుషము విరియఁ జిమ్మి, మ
హారాష్ట్రులు తోడు నీడలై సాయపడన్॥

ఉ॥ దక్కను భామినీదొరలు తా మటు యావనులయ్యు, నెయ్యమున్
మక్కువఁజూపి హైందవుల మానసముల్ తనివోందఁ జేయుటల్
పెక్కు తెఱంగులై, సవతి బిడ్డలు, కౌరవపాండు పుత్రు ల
ట్లొక్క కుటుంబమందలి యమోమయముల్ గనుచుండి రెంతయున్॥

ఉ॥ ‡ కన్నెలఁ బెండ్లియాడి, యధికారము లిచ్చియుఁ, గొంద ఱందు
యన్నెముఁ బున్నెమెంచక, సహాసన భోజన పానరక్తి మీ
ఱ న్నటి యించి, వారి బయిరాగుల పీరిఫకీరులన్ సమా
నోన్నతి గౌరవించి, రిటు లొండొక నెయ్యము నామతింపుచున్॥ 28

‡ "The Mahomedan rulers in the Deccan took Hindu wives in their harems." (Page 31)

"Some Mahomedan Fakirs have been ranked with the Hindu saints in general veneration and there are some saints who are venerated by both communities alike." (P. 24)

"Rise of the Maratha Power" by M. G. Ranade

చ॥ మొదవును లేఁగ మూతివిఱుపుల్ గనకుండఁగ సంతరింపుచుఁ
బిదికినఁ, గుండపాల్గురియుఁ; బెట్టక ముట్టక తాఁపిటఁ గట్టుచుఁ
బాదుఁగును గోయుచో రుధిర పూరము పాఱదె? ముట్టి యేల్బ
మెదిగిన రాజులుఁ బ్రజలు మేలిమిఁదాలిమిఁ బొందఁ నేర్తురే!॥

ఉ॥ తీఱని యుమ్మలో మునుకఁదేలుచు, నాఁటి నవాబులుఁ 'శిలే
దారు' 'హవాలుదారు' 'సరదారును' 'మాన్సబుదారులుఁ' 'మ
దా' రను పేరఁగొందఱు, స్వతంత్రులు గాగిమదాన్ల దైతులఁ
బేరులఁగొందఱై, మదిఁ దపించి రతంత్ర పరాశ్రయంబులఁ॥

ఆ॥ వే॥ తల్లిలేని దూడ తడవుచు, నేయూప్రు
పొదుఁగునైన మూతిముట్టఁబోవఁ
జుఱుకుఁగాలిద్రవేటు కఱకుఁగొమ్ముల [illegible]
గాక, కడుపు నింపు కరణి గలదె!॥

శా॥ "స్వాతంత్ర్యంబునఁబుట్టి చావవలె" నన్వారల్ మహారాష్ట్ర శ్రీ
రీతుల్ గొందఱుమెచ్చ కొంకక - పెరదారిన్ దీసి; నేఁగొందఱో
యోతప్రోతము లెంచ కాదొరల యుద్యోగంబు [illegible]; రు
ఖ్యాతల్ వో నెదురొడ్డె నీయలలు [illegible]

క॥ కడుపునకై కాలీనత
నడఁపంగా నిష్టపడని యభిమానధనుల్
పడఁతులతోఁ గొడుకులతో
నిడుమఁ గుడిచి రడవులఁ మహీంధరదరులఁ॥

---

oppressed beyond measure." "A History of India - Part P. 135, C. S. Srinivasachari & M. S. Ramaswami Aiyan

† "Everything, therefore, seemed to be leading u[s to] one inevitable end — the ruin and the devastation of Hindu Province, the annihilation of their old royal hou[se], the destruction of their religion, their temples, their cit[ies]" "A Forgotten Empire" Mr. Se[well]

